# నా జన్మభూమి



రవీంద్రనాథ టాగూరు

అనువాదం :

ఖండవిల్లి సాంబశివరావు

జయంతి పబ్లికేషన్సు

గోపాలరెడ్డి రోడ్డు : విజయవాడ-2.

# ఒక మాట

గురుదేవులు రవీంద్రనాథ ఠాగూరు తాను జన్మించిన వంగదేశపు నాగరికత, సాంప్రదాయం, పల్లెసీమలు, పల్లెపడుచులు, వారి ఆహార వ్యవహారాలు, ప్రకృతిసౌందర్యం, నదీమతల్లుల గలగలా రావాలు, పసిపాపల మందహాసం, జానపదుల జీవనం, తన మాతృభూమిని పర్యటించి దర్శించివ్రాసిన ఈ "నా జన్మభూమి" అన్నికోణాలనుంచి వంగభూమి మనకు దర్శనమౌతుంది.

ప్రముఖ సాహితీవేత్త స్నేహప్రియులునగు శ్రీ ఖండవిల్లి సాంబశివరావు గారికి, మా ప్రచురణలకు చేయూతనిస్తున్న పెద్దలకు, మిత్రులకు, సోదర ప్రచురణ కర్తలకు, పుస్తక విక్రేతలకు, మా ప్రచురణల ఆదరిస్తున్న ఆంధ్రప్రజలకు మా నమో వాకములు.

ఇట్లు,

ప్రచురణకర్తలు.




# బండోరా

## ( సముద్ర తీరాన )

అక్టోబరు 1885

రక్షణలేని ఆ సాగరం ఆక్రందనచేస్తూ లేచిపడుతూ, గాఢంగా నిట్టూరుస్తూ, నురగలు గ్రక్కుతోంది. అది బంధింపబడ్డ భయంకర రాక్షసిలా కనపడుతోంది. ఆ రాక్షసి కట్లు తెంచుకునేందుకు సర్వ ప్రయత్నాలు చేస్తూ, అలసి పోతూ, ఆగ్రహావేశంలో తోకను నేలకేసి బాదుతూన్నట్లు, తెరచుకొని ఉన్న దాని పెద్దనోటికి ఎదురుగా తీరాన గల మా ఇళ్ళల్లోంచి దానిని మేం చూస్తూన్నట్లు అనిపించింది.

దానికి ఎంత బలం ఉంది! దాని కెరటాలు రాక్షసుని కండరాల్లా ఎంతలా పొంగుతున్నాయో.

సృష్టి ప్రారంభమయిన నాటినుంచీ నేలకూ నీటికీ ఈ చెప్పబోయే ఎడతెగని పోరాటం జరుగుతూనే ఉంది. నేల ఉలక్కుండా పల్కకుండా, మెల్లమెల్లగా, సముద్రంలోని భాగాన్ని తన బిడ్డలకోసం తన రాజ్యంలో కలుపుకుని బాగా విస్తరిస్తోంది. సముద్రం ఏమీ చేయలేక, గాఢంగా నిట్టూరుస్తూ, విలపిస్తూ, గుండెలు బాదుకుంటూ నిరాశతో ఒక్కొక్క అడుగే వెనక్కి వెళ్ళిపోతోంది. సముద్రం ఒకానొకప్పుడు

ఏకచ్ఛత్రాధిపత్యం వహించి, సర్వ స్వతంత్రింగానూ, నిరాటంకంగాను ఉండేది అన్న సంగతి జ్ఞాపకానికి తెచ్చుకోవాలి మనం.

నేల సముద్రగర్భంనుంచే ఉద్భవించి, దాని సింహాసనాన్ని అక్రమంగా ఆక్రమించినది. అప్పటినుంచీ పిచ్చెత్తిన ఆవృద్ధ సముద్రం నురగలు గ్రక్కుతూ, నెత్తి మొత్తుకుంటూ బోరున ఏడుస్తూ లియర్ చక్రవర్తిలా నిరంతరం దుఃఖిస్తూ ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, గాలికి శోషిల్లుతూ అలా ఉంది.

జూలై 1887

నేను ఇప్పుడు నా ఇరవై ఏడవ ఏటిలో ఉన్నాను. ఈ పుట్టిన దినం నా మనస్సులో గాఢంగా హత్తుకుపోయింది. ఈ మధ్య మరేమీ జరిగినట్లు లేదు. అదే నా కళ్ళముందు ప్రత్యక్షం అవుతోంది.

ఇరవై ఏడవ సంవత్సరాన్ని చేరడం అంటే స్వల్ప విషయమా? వ్యక్తి జీవితంలో ఇరవయ్యోపడి దాటి ముప్ఫయ్యోపడిని సమీపించటం అంటే సామాన్యమా? ముప్ఫయి అంటే యవ్వనదశ-మానవులు ఆకులను గాక ఫలాలను ఆశించే వయస్సు అది-గాని ఫలం తప్పకుండా లభిస్తుందన్న నమ్మకం ఏది? నేను తల పంకిస్తూండగా అది మాత్రం జ్ఞానమన్నది లేశమయినా లేకుండా, అవివేకంతో నిండి ఉన్నట్లుగానే ఉంది.

# 7

లోకం అప్పుడే మాటలు అనడం ప్రారంభించింది ఈ విధంగా:

"నీ దగ్గరనుంచి మేం ఆశించినది ఏదీ! కొండంత ఆశ పెట్టుకొని లేత మొలకగా ఉన్న నాటినుంచీ నిన్ను మెచ్చు కుంటునాన్నమే! నీ కుర్రితనంతోనే ఎల్లకాలం సరిపెట్టుకో మంటావా? నీ నుంచి మాకు చేకూరే లాభం ఏమిటో ఆలస్యం చేయకుండా తేల్చుకోవాలి. గంతలు కట్టుకొని, గానుగను త్రిప్పుతూన్న నిష్పాక్షిక విమర్శకుడు నీ నుంచి ఎంతపాలు నూనె పిండగలడో మాకు అంచనా కావాలి."

నా మీద ఎంతో ఆశపెట్టుకొని ఉన్న ఈ లోకాన్ని ఇటుపైని ఆ ఆశతో అలా కూచోపెట్టి మోసగించడం నాకు అసాధ్యమయిపోయింది. నేను చిన్నవాడిగా ఉండగా నమ్మకం కొద్దీ నాకు పరపతి ఇచ్చేరు. రమారమి ముప్ఫయిఏళ్ళు ఒంటి మీదకు వచ్చేక, ఈనాడు వాళ్ళకు ఆశాభంగం కలిగించ టానికి చాలా విచారంగా ఉంది. గాని నేనేం చేయను? తెలివి తేటలతో కూడుకున్న మాటలు నాకు రావటంలేదు! ప్రజా బాహుళ్యానికి లాభసాటిగా ఉండే వాటిని ఈయటానికి నేను పూర్తిగా అసమర్థుణ్ణి. ఏదో ఓ గాలిపాట పాడటం, లోకాభి రామాయణం మాటాడుతూండటం, ఏవేవో తమాషా పనులు చేయడం, ఇంతకుమించి మరేవిధమయిన అభివృద్ధి నాలో కలగలేదు. నామీద పెద్దపెద్ద ఆశలు పెట్టుకున్న వారందరికీ నన్ను చూస్తే ఆగ్రహం కలగటం నిశ్చయం. గాని వాళ్ళను అటువంటి ఆశలను పెట్టుకోమని ఎవరు ప్రార్థించేరు?

పిల్ల తెమ్మెరలతోనూ, దివ్యకాంతితోనూ, క్రొంజిగురాకులతోనూ, క్రొవ్విరులతోనూ ఆ పాట రమణీయంగా ఉన్న వైశాఖ సుప్రభాతాన నా ఇరవైఏడవ పుట్టిన దినం పండగ జరుపుకునేందుకు మేల్కొన్నాను. అప్పటినుంచీ పై ఆలోచనలు నన్ను చుట్టుముట్టుతున్నాయి.

షెలీవా, 1888

మా ఇంటి పడవ నదికి ఆవలి తీరాన ఇసుకగట్టున లంగరు వేయబడి ఉంది. అన్నివైపులా దృష్టిపథాన్నధిగమించి ఇసుక ఒక పెద్ద ఎడారిలా పరచుకుని ఉంది. మధ్య మధ్య సన్నని జలశాఖలు పరుగులు పెడుతూన్నట్లు అగపడతాయి. నీరులా తళతళా మెరిసేది కొన్నికొన్ని చోట్ల కేవలం ఇసుక మాత్రమే.

అక్కడ ఒక ఊరుగాని, మానవుడుగాని, చెట్టుగాని ఒక్క గడ్డిపోచగాని కనబడదు. మహా విసుగు కలిగించే ఆ తెల్లదనంలో ఉపశమనాన్ని కగిలించేదల్లా నల్లరేగటిమట్టి, తేమ కలసిన బీటలుపడ్డ నేల మాత్రం.

తూర్పు దెసగా చూస్తే అనంతమైన నీలిమ మీదనూ అనంతమైన తెలుపు క్రిందనూ గోచరిస్తాయి. ఆకాశం శూన్యం. భూమికూడా శూన్యమే. క్రిందున్న శూన్యం కఠినంగానూ, నిస్సారంగానూ ఉంది. మీదున్న శూన్యం విల్లులా వంగి ఆకాశతత్వంతో కూడుకుని ఉంది. ఇటువంటి భయంకర నిర్జీవ చిత్రాన్ని మరోచోట చూద్దామన్నా కనబడదు.

గాని పశ్చిమ దిశకేసి తిరుగుతే అక్కడ నీరు కనబడుతుంది. వంపుతిరిగిన ఆ నది, దాని ఎత్తయిన గట్టు, అంత వరకు వ్యాపించిన ఆ పల్లెతోపులు, ఆ తోపుల్లోంచి తొంగి చూస్తోన్న పూరిగుడిసెలు, అన్నీ సంజవెలుగులో మనోహర స్వప్నంలా గోచరిస్తాయి. ఒక్క "సంజవెలుగే" ఎందుకు అన్నానంటే, మేం వాహ్యాళికి బయటకు వెళ్ళే సమయం సాయంత్రమే. అందుచేత అప్పటి దృశ్యమే నా మనోఫలకం మీద ముద్రితమయింది.

షాజెద్‌పూర్ 1890

మేజస్ట్రేటు తన గుడారం తాలూకు వసారాలో కూచుని, చెట్ల నీడల్లో వేచియున్న ప్రజానీకాన్ని, ఒకరి తరువాత ఒకరిని పిలిచి న్యాయవిచారణచేసి, తీర్పులు ఇస్తున్నాడు. నా పల్లకీని తీసుకువెళ్ళి అతనికి ఎదురుగా దింపేరు. ఆ ఆంగ్లేయ యువకుడు నన్ను ఎంతో మర్యాదగా ఆహ్వానించి లోనికి తీసుకువెళ్ళాడు. అతనికి పల్చటి జుత్తు ఉంది. అదీ అక్కడక్కడ మాత్రమే నల్లగా ఉన్నది. నూనూగు మీసం అప్పుడే వస్తోంది. యవ్వనం తొణికిసలాడుతూన్న లేతముఖాన్ని తప్పిస్తే, తల నెరసిన వృద్ధునిక్రిందే ఎవరయినా అతనిని జమకడతారు.

మా ఇంట విందు భోజనానికి అతనిని నేను ఆహ్వానించగా, తను అడవిపందుల వేటగాళ్ళకు ఏర్పాట్లు చేయటానికి ఎక్కడికో వెళ్ళవలసి ఉందని జవాబిచ్చేడు.

నేను అక్కడనుండి ఇంటికి తిరిగి రాగానే, ప్రళయ కాల కారుమేఘాలు ఆకాశంలో క్రమ్ముకొని, బ్రహ్మాండ మయిన గాలివాన ప్రారంభించి, కుండపోతగా వర్షం కురియ సాగింది. నేను ఏ పుస్తకాన్నీ ముట్టుకోలేకపోయాను. ఏం వ్రాద్దామన్నా సాధ్యం కాలేదు. ఆ కింకర్తవ్యతా విమూఢ స్థితిలో ఒక గదిలోంచి మరోగదిలోనికి పచారీలు చేయడం మొదలెట్టాను. ఇల్లంతా గాఢాంధకారంలో మునిగిపోయింది మేఘాలు భయంకరంగా గర్జిస్తూనే ఉన్నాయి. కళ్ళు మిరి మిట్లు గొల్పుతూ మెరుపు మీద మెరుపు మెరుస్తూనే ఉంది. ఉండీ ఉడిగీ ఝంఝూమారుతం రివ్వున వచ్చి, లీచీ మహా వృక్షం మెడకాయ పట్టులంకించుకొని గట్టిగా గుంజుతూంది. ఇంటి ముందున్న పల్లపు స్థలం పూర్తిగా నీటితో నిండిపో యింది. ఈ సమయంలో ఆ మేజస్ట్రేటుకు ఈ ఇంట్లో ఆశ్రి యం ఇయ్యాలన్న ఆలోచన పచారీచేస్తూన్న నాకు హఠా త్తుగా స్ఫురించింది.

వెంటనే అతనిని తీసుకురమ్మనమని కబురు పంపేను. తరువాత అతనికి ఇవ్వటానికి గదికోసం ఇల్లంతా శోధించేను. వెతకగా వెతకగా ఖాళీగా ఒక్కగది మాత్రమే కనుపించింది. ఆ గది దూలాలకు వ్రేలాడగట్టిన చెక్కలతో నిండిపోయింది. ఆ చెక్కలమీద పాత, కుళ్ళు రోజాయీలు, దిండ్లు పడి ఉన్నాయి. నౌకర్ల సామాన్లు, మట్టితో అట్టకట్టుకుపోయిన ఓ పాత చాప, హుక్కాగొట్టాలు, పొగాకు కట్టలు, నిప్పు రాజేసుకొనే గుడ్డపీలికలు, పీచు, రెండు కర్రబీరువాలు నేల

మీద పెంటలా పారేసి ఉన్నాయి. ఇవిగాక కెటిలు మీది తుప్పుపట్టిన మూత ఒకటి, అడుగులేని ఇనపస్టవ్ ఒకటి, రంగుపోయిన నికెల్ టీ పాత్ర ఒకటి, దుమ్ముతోను బెల్లం పాకంతోనూ నల్లగా ఉన్న పళ్ళెం ఒకటి, –ఇంకా ఇటువంటి అనేకమయిన పనికిరాని వస్తువులతో నిండిన పేకేజీ పెట్టెల తోనూ ఆగది నిండిపోయింది. గిన్నెలు తుడుచుకునే గుడ్డలూ వంటమనిషి దుస్తులూ, నెత్తినిపెట్టుకునే టోపీ గోడల కున్న మేకుల్ని వ్రేలాడుతున్నాయి. అక్కడ కుంటి డ్రెస్సింగ్ టేబిలు ఒకటిమాత్రం ఉంది. దాని నిండా నీటి మరకలు, పాల మరకలు, నలుపుగోధుమ తెలుపు మరకలు, ఇంకా అన్ని విధాలయిన కల్తీ మరకలు ఉన్నాయి. ఆ టేబిలునుండి ఊడి పోయి ఒక గోడకు ఆనుకొని ఉంది నిలువుటద్దం. దాని సొరుగులు మురికి రుమాళ్ళు మొదలుకొని, సీసాలకు చుట్టే తీగల వరకు స్థావరాలుగా వున్నాయి.

ఆగదిని చూడగానే ఓ క్షణం గాభరాపడ్డాను. వెంటనే మేనేజరుకు కబురుపంపేను. స్టోరుకీపరుకు కబురుపంపేను. నౌఖర్లందరినీ పిలిపించేను. నీళ్ళు తెప్పించేను. నిచ్చెనలు వేయించేను. తాళ్ళు ఇప్పించి బల్లచెక్కలు పీకించేసాను. గుడ్డలన్నీ బయటకుపంపించేను. పగిలిన గాజుముక్కలు ప్రతీదీ జాగ్రత్తగా పరిహరించేసాను. గోడలకున్న మేకులన్నీ ఒకటి ఒకటీ ఊడ బెరికించేసాను. వేలాడుతున్న పలకల గాజు దీపస్థంభం క్రిందపడి నేలంతా గాజు ముక్కలతో నిండిపోయింది మళ్లా అవన్నీ ఒక్కొక్క ముక్కే ఏరిపించి -పార వేయించేను. దుమ్మూ

ధూళితో నిండి ఉన్న నేలమీద చాప నేనే స్వయంగా తీసి కిటికీలోంచి బయటికి దులిపేను. ఆ దులపటంలో,— నారొొట్టెను, నాబెల్లపు పాకాన్ని, నా జోళ్ళకు వేసిన రంగు ను తింటూ బ్రతుకు తూన్న—ఎన్నోబొద్దెంకలు, రాలిపో యాయి బయట.

ఇంతలో మేజస్ట్రేటు దగ్గరనుంచి కబురువచ్చింది. అతని గుడారం అంతా భయంకరస్థితిలో ఉందని అతను వెంటనే బయలుదేరి వచ్చేస్తున్నాడని తెలియగానే "తొంద రగా కానీయండి, తొందరగా కానీయండి" అంటూ నౌఖ ర్లను ఒత్తిడిచేయ సాగేను. అంతలోనే "దొరగారు వచ్చే సారు, దొరగారు వచ్చేసారు" అన్న కేకలు వినిపించాయి. నేను ఖంగారుపడి, జుత్తుమీదా, గడ్డంమీదా, మిగతా ఒంటి మీదా పడ్డ దుమ్మూ ధూళిని తొందరతొందరగా దులుపు కొన్నాను. అతనికి స్వాగతమియ్యటానికి డ్రాయింగు రూం లోకి వెళుతూ, ఆ గదిలోనే మధ్యాహ్నంనుంచీ హాయిగా విశ్రాంతి తీసుకుంటూన్న పెద్దమనిషిలా నటించేను.

మేజస్ట్రేటు, నేనూ కరచాలనాలు చేసుకోడం పూర్తి యింది. బయటకు ప్రశాంతంగా కనబడుతూ మాటాడుతున్నా నేగాని, లోలోపల అతనికిఇయ్యబోయే వసతిగురించి భయ సం దేహాలు తలెత్తి బాధిస్తునే ఉన్నాయి. ఆ అతిథికి ఎట్టకేలకు గది చూపించక తప్పలేదు. అప్పుడు చూస్తే అది ఒక మాది రిగా బాగానే కనబడింది. నాకు నివాసాలు గోల్పోయిన బొద్దింకలు మాత్రం అతని అరికాళ్ళకు చక్కిలిగింతలు పెట్ట

కుండా ఉన్నట్టయితే, ఆ రాత్రి ఏదో విధంగా అతనికి నిద్ర పట్టవచ్చు అనిపించింది.

కాళీగ్రాం 1891

క్షణం విశ్రాంతి లేకుండా సుఖాన్ని, ఏ బాధ్యతలూ లేకుండా ఆనందాన్ని అనుభవిస్తున్నాను.

ఈ చుట్టుప్రక్కలంతా ఆ విధమయిన వాతావరణమే వ్యాపించి ఉంది. అల్లంత దూరంలో, ఒకనదికూడా ఉంది. గాని ప్రవహిస్తూనట్లు కనబడలేదు. పైకి తేలుతూన్న నాచు మొక్కలు దుప్పటీ ముసుగుపెట్టుకొని వెచ్చగా పడుకొని "కద లవలసిన అవసరం లేకుండానే కాలం గడచిపోతూన్నపుడు నన్ను నేను ఎందుకు కదిలించుకోవాలి" అని అనుకుంటూన్న ట్లుంది ఆనది. అందుచేత ఒడ్డునే బారులు తీర్చి ఉన్న రెల్లుదు బ్బులు, వలలుపట్టుకొని జాలరులు వచ్చేవరకు ఏ విధమయిన అల్లరి ఎరుగక అతి ప్రశాంతంగా ఉంటాయి.

ఆ దగ్గరలోనే నాలుగయిదు పెద్ద పడవలు ఒకదాని ప్రక్క ఒకటి కట్టబడి ఉన్నాయి. వాటిలో ఒక పడవ టాపు మీద ఒక జాలరి పాదాలనుంచి శిరసు పర్యంతం దుప్పటీ ముసుగుపెట్టి గాఢంగా నిద్రిస్తున్నాడు. మరో దానిమీద, మరోజాలరి సూర్య రశ్మిలో చలికాగుతూ, దారానికి పురి పెట్టి తాడు అల్లుతున్నాడు. మూడోపడవలో క్రిందిభాగంలో ఒంటిమీద గుడ్డలేని ఓ ముసలివ్యక్తి తెడ్డుమీదికి కొద్దిగా వాలి, మా పడవకేసి రెప్పవాల్చకుండా అర్థంలేని చూపు చూస్తున్నాడు.

ఆ తీరం వెంబడే అనేక తరహాలకు చెందిన మనుష్యులు ఉన్నారు. గాని వాళ్ళందరూ ఎందుకు వస్తున్నారో పోతు న్నారో, ఆ పెళ్ళినడక లేమిటో, పిరిలమీద కూచుని మోకా ళ్ళకు చేతులు పెనవేసుకుని ఎందుకు కూచ్చున్నారో, అలా శూన్యంగా ఎందుకు చూస్తున్నారో, ఎవరం ఊహించలేము.

అక్కడ సంచలనం ఒక్క బాతులలోనే అగపడుతుంది అవి "క్వా క్వా" అంటూ అరుస్తూ సందడిచేస్తూ, నీటిలో బుడుంగున తలలు ముంచి చప్పున బయటికి తీస్తూ, అంటు కున్న నీటిని చకచకా విదలిస్తూ, నీటి అడుగున ఏ ఇంద్ర జాలాలు ఉన్నాయో • అని-మాటిమాటికి పరిశోధిస్తూన్నట్లు తలలు ముంచుకూ, మళ్ళాలేచి తలలు ఆడిస్తూ "ఏంలేదు ఏంలేదు" అని పరిశోధనా ఫలితాలు నివేదిస్తున్నట్లు అగపడు తున్నాయి.

ఇక్కడ రోజులు, పన్నెండు గంటలూ సూర్యకాంతిలో బద్ధకంగా గడపి, మిగిలిన పన్నెండు గంటలూ చీకటి దుప్పటి కప్పుకొని, నిశ్శబ్దంగా నిద్రపోతాయి. ఇటువంటి ప్రదేశంలో మనం ఏం చేయటానికి ఇష్టపడతామంటే—ప్రకృతి దృశ్యాన్ని నిరంతం చూడటం, చలికాలంనాటి మధ్యాహ్నన సూర్యునికి వెనుదిరిగి, బిడ్డని నిద్రపుచ్చటానికి తల్లి ఊపుతూ జోలపాడు తూన్నట్లుగా ఏవేవో చిత్రవిచిత్ర భావాలను సృష్టించుకొని ఊయల లూపుతూ, మధ్యమధ్య ఏవో కూనిరాగాలు పాడటం చేస్తాం, అంతకు తప్ప మరేం చేయలేం.

కాశీగ్రాం 1881

నిన్న, నా రైతులు వాళ్ళ కష్టసుఖాలు, నాతో చెప్పుకుంటూన్న సమయంలో అయిదారుగురు పిల్లకాయలు అక్కడకు వచ్చి ఒక వరుసలో చక్కగా నిలబడ్డారు. వాళ్ళు ఎందుకు వచ్చారని నేను ప్రశ్నించకముందే వాళ్ళ నాయకుడు ఏరి కూర్చిన పెద్దపెద్ద పదాలతో అనర్గళంగా చెప్పడం ప్రారంభించేడు. "ఘనమైన అయ్యా! సర్వశక్తి సంపన్నుడైన పరమేశ్వరుని కృపవలన, అజ్ఞానులమయిన మీ బిడ్డల అదృష్టం వలననూ, ప్రభువులవారి ఘనమైన దర్శన భాగ్యం నేడు ఈ గడ్డపై మాకు తిరిగి లభించింది"—ఈ ధోరణిలో రమారమి అరగంటసేపు ఆ కుర్రాడు చెప్పుకుపోయేడు. ఎవరు చెప్పినవో అవటంచేత ఆ పదాలు మధ్యమధ్య జ్ఞాపకం రాకపోవడం, తప్పులు దొర్లడం, సరయిన పదంకోసం ఆగి, ఆకాశంకేసి చూడటం, తప్పును సరిదిద్దుకొని తిరిగి చెప్పటం చేస్తున్నాడు ఆ పిల్లకాయ చెప్పిన దాన్నిబట్టి నేను గ్రహించిందేమంటే, వాళ్ళస్కూలులో బెంచీలు, స్టూళ్ళు తక్కువగా ఉన్నాయని "కర్రతో చేయబడ్డ ఈ ఆసనాలు చాలక పోవటంచేత మేం ఎక్కడ కూర్చోవాలో, పూజ్యులైన మాగురువులను ఎక్కడ కూర్చోపెట్టాలో, అత్యధిక గౌరవనీయులైన మా ఇనస్పెక్టరు గారు తణిఖీకి వచ్చినప్పుడు ఏ ఆసనం సమర్పించాలో మాకు తెలియడంలేదు" అంటూ ఆ కుర్రాడు చెప్పేడు.

వేలంత ఉన్నాడోలేదో ఆ కుర్రాడి నోటినుంచి వెలువడుతూన్న ఆఅనర్గళ వాక్ప్రవాహానికి నవ్వు ఎంతఆపుకుందామన్నా ఆపుకోలేక పోయాను. ఆ పిల్లవాడు అలా అక్కడ

మాటాడం సందర్భోచితంగా కూడా లేదు. రైతులందరికీ తమకు సంబంధించిన ముఖ్యవిషయాలన్నీ తమ మాతృభాషలోనే సరళంగానూ, సూటిగానూ, నివేదించుకోటానికి అవకాశం ఇచ్చేను. అందులోకూడా ఏవో క్లిష్టపదాలు వాళ్ళు ప్రయోగించి, అర్థానంతా చెడకొడుతున్నారు. ఆ వాతావరణంలో ఈ కుర్రాడి భాషకు నాకు నవ్వు కలిగింది. ఆ అబ్బాయి చెప్పినది అక్కడి గుమాస్తాలకు, రైతులకు నచ్చినట్లుంది. జమీందారుగారితో అంత బ్రిహ్మాండంగా విన్నవించుకునే అవకాశం పిల్లలకు ఇప్పటివరకు కల్పించనందులకు వాళ్ళ తల్లిదండ్రులమీద కోపం వచ్చినట్లుగాకూడా కనుపించేరు.

ఆ బాలవక్త ఉపన్యాసం ముగించక మునుపే నేను అడ్డుతగిలి, అవసరమయిన, బెంచీలు, స్టూళ్ళు అన్నీ యిస్తానని వాగ్దానం చేశాను. అతడు నిర్భయంగా నుంచుని, నేచెప్పేది చెప్పుకోటానికి అవకాశం ఇచ్చి, తరువాత ఎక్కడయితే తనప్రసంగం ఆగిపోయిందో అక్కడనుంచి తిరిగి ప్రారంభించి, చివారి పదం వరకు కొనసాగించి, తరువాత నాకు వందన సమర్పణం చేసి, తన సేనను నడిపించుకు వెళ్ళిపోయాడు. కూర్చునేందుకు కావలసిన బెంచీలూ అవీ సరఫరా చేయటానికి నేను తిరస్కరించినా బహుశా ఆ అబ్బాయి మరేం అనుకోని ఉండేవాడు. కాని ఎంతో కష్టపడి కంఠతాపెట్టిన ఉపన్యాసంలో ఏ భాగాన్నయినా పాడుచేసినట్లయితే అతను అమితంగా గినిసి ఉండేవాడు. అందుచేతనే, అతి ముఖ్యమయిన వ్యవహారం నిలబడిపోయినప్పటికీ, ఆ అబ్బాయి చెప్పేది సాంతం వినవలసి వచ్చింది.

షాజెద్‌పూర్ సమీపాన; జనవరి 1891

మరణిస్తూన్న మానవునిలో రక్త ప్రసారంలా మంద కొడిగా ఉన్న కాళీగ్రాం తాలూకు చిన్ననదికి దాటి వడి వడిగా ప్రవహిస్తోన్న ప్రవాహంలోకి వచ్చిపడ్డాం. ఆ ప్రవాహం తీసుకునివెళ్ళి, మమ్మల్ని ఒక ప్రదేశానికి జేర్చింది. అక్కడ నీరూ, నేలా ఒకదానిలో ఒకటి సమ్మేళనం పొంది నట్లుగా కనబడుతూంది. పసితనంలోని సోదరీల్లా అక్కడ నదికి, దానిగట్టుకు ఏమీ తేడా కనిపించలేదు.

అక్కడ నది ఒండ్రు నిగారింపునంతా నష్టపోయింది. దాని ప్రవాహం బహు ముఖాలుగా చెదరిపోయి అంతటా విస్తరించుకుని, చివారికి చిత్తడి నేలగా తయారయింది. అందులో అక్కడక్కడ గల పసరిక నేలలనూ, మధ్యమధ్య మిలమిలా మెరిసే నీళ్ళనూ చూస్తే, మన భూగోళం చిన్న తనం జ్ఞప్తికి వస్తోంది. అపరిమిత జలరాశినుండి నేల కొద్దిగా తల ఎత్తడం ప్రారంభించే సరికి ఘనద్రవమండలాల విభజన జరగలేదు. ఎక్కడినుంచి, భూభాగామో, ఎక్కడనుంచి జల భాగమో చెప్ప వీలులేకపోయింది. అదేస్థితి ఇక్కడ ఇప్పుడు ద్యోతక మవుతోంది.

మా పడవ లంగరువేసి ఆగిన చుట్టుప్రక్కల, బెస్తల వెదురు బొంగులు పాతివున్నాయి. వలలలో పడ్డ చేపలను ఎత్తుకు పోవటానికై గరుడపక్షులు మీాదను తిరుగుతూ సిద్ధంగా ఉన్నాయి. బురదనీటి అంచున ఎన్నో పరిగె పిట్టలు నుంచుని, సాధువుల్లా కనబడుతూ, ధ్యానంలో నిమగ్నమయి ఉన్నాయి. అక్కడ అన్ని జాతుల జలపక్షులు అమితంగా ఉన్నాయి. దున్నకుండా, సత్తువచేయకుండా, సారవంతమైన

ఆ ఒండ్రుమట్టిలోంచి లేచిన వరిచేలు అక్కడక్కడ కనబడుతున్నాయి. నీటిమీద నాచుమొక్కలు తేలుతూ ఉన్నాయి ప్రవహించకుండా ఒకేచోట ఉండిపోయిన ఆ నీటిమీద దోమలు అసంఖ్యాకంగా జుమ్మని ముసురుతున్నాయి.

ఈ రోజు ఉదయాన్నే మేం మళ్ళా బయలుదేరి కాచీ కాటా గుండా వెళ్ళేం. అక్కడే ఆ చిత్తడి నేలలోని ముగ్గు నీళ్ళు ఆరేడు గజాలు వెడల్పుగల కాల్వలోపడి అతి వడిగా ప్రవహించుకుంటూ పోతున్నాయి. ఇలాంటి దానిగుండా పెద్ద ఇంటి పడవను తీసుకువెళ్ళటం నిజంగా ఒక సాహసోపేతమయిన పనే! ప్రవాహం దాన్ని మెరపు వేగంతో త్రోసుకుపోతోంది. పడవ సరంగులు తెడ్లనే వెదురు బొంగులుగా ఉపయోగిస్తూ, పడవ గట్టును కొట్టుకోకుండా అన్ని జాగ్రతలు తీసుకుంటూ, అతి చురుగ్గా ఉన్నారు. ఆ విధంగా మేం తిరిగి అసలు నదీ ప్రవాహంలోకి రాగలిగేం.

అప్పటికి ఆకాశంలో దట్టంగా మబ్బులు క్రిమ్ముకున్నాయి. చల్లటి నీటిగాలి వీచింది. అడపాతడతా వర్షం జల్లులు పడుతున్నాయి. సరంగులందరు చలిలో గజగజ ఒణికిపోతున్నారు. అటువంటి నిరుత్సాహ వాతావరణంలో ఆ ముసురు రోజులు నాకేమీ రుచింపవు. ఆ దౌర్భాగ్యనిర్జీవ ఉదయాన్ని బాధతో గడపేశాను. మధ్యాహ్నం రెండయ్యేసరికి సూర్యుడు బయటికి వచ్చేడు. అప్పటినుంచీ సంతోషం వెల్లివిరిసింది. ఇప్పుడు చూస్తే నది తాలూకు గట్లు ఎంతో ఎత్తుగా ఉన్నాయి. వాటిమీద ప్రశాంతమయిన తోపులూ, మానవ కుటీరాలు ఏకాంతంగానూ, సౌందర్య ప్రపూర్ణంగానూ ఉన్నాయి.

ఈ నది మెలికలు మెలికలు తిరుగుతూ పోతుంది. సోమరీకాక, అల్లరిమారీకాక అజ్ఞాతంగా వంగదేశపు అంతఃపురంలో తిరిగే ఈనదీచిన్నది తన అనురాగ సంపదను ఉభయ తీరాలకు అపరిమితంగా పంచిపెడుతూ, అందరి సుఖదుఃఖాలను విచారిస్తూ, నీళ్ళకోసం వచ్చి, తన ప్రక్కనే కూర్చుని, తడి తుండ్లతో శరీరాలు తళతళలాడే పర్యంతరం శ్రద్ధగా తోము కుంటూన్న పల్లెపడుచులతో గృహవిషయాలు ముచ్చటి స్తూంటుంది.

ఏకాంతంగా ఉన్న ఒకనదీ వంఘులో, ఈ సాయంత్రం మా పడవకు లంగరువేసి ఉంచేం. ఆకాశం నిర్మలంగా ఉంది చంద్రుడు షోడశ కళలతో విరాజిల్లుతున్నాడు. ఇంకో పడవ కంటికి కనుపించలేదు.నీటి అలలపై వెన్నెల మెరుస్తోంది. నదీ తీరాన్న ఏకాంతం పరిపాలిస్తోంది. చెట్ల గుబుర్లలో దూరాన గల పల్లె నిద్రిస్తోంది. చెవులు చిల్లులు పడేట్లు అరుస్తూన్న కీచురాళ్ళ సంతత రొద తప్ప మరోధ్వని అక్కడలేదు.

షాజద్‌పూర్: ఫిబ్రవరి 1891

ఏటికి ఆవలి ఒడ్డున నాకిటికి ఎదురుగా మరాటీకీ (జిప్సీ) దండు ఒకటి, వెదురు బద్దల చాపలు, చిన్నచిన్న గుడ్డ పీలికలు కప్పిన, వెదుళ్ళతో నిర్మించిన గుడిసెలలో హాయిగా జీవిస్తోంది. ఇటువంటి గుడిసెలు మూడు మాత్రమే అక్కడ ఉన్నాయి. అవి ఎత్తుతక్కువవి అవటంచేత వాటిలోపల ఎవరూ నిటారుగా నుంచోలేరు. ఆ మరాటీలు జీవితాలు ఆరు బయటే గడుపుతారు. ఒక్క రాత్రిపూట మాత్రం అందరూ కలసి నిద్రించటానికి, ఈ గుడిసెలలోనికి పాకురుకుంటూ దూకుతారు.

ఈ మరాటీల జీవితమే అంత! వాళ్ళకు స్థిర నివాసానికి ఎక్కడా ఒక కొంప అంటూ ఉండదు. శిస్తు చెల్లించటానికి ఏ భూఖామందు లేడు. ఎక్కడకు వెళ్ళాలని ఉంటే అక్కడకు హాయిగా పిల్లలతోనూ, పందులతోనూ. ఒకటో రెండో కుక్కలతోనూ బయలు దేరిపోతూంటారు. ఇలా తిరుగుతూండే వీళ్ళమీద పోలీసులు ఒక కన్ను వేసి ఉంచుతూంటారు.

నాకు సమీపాన గల కుటుంబం చేస్తూన్న పనిపాటులు మాత్రం నేను కనిపెడుతూనే ఉన్నాను. వాళ్ళు నల్లగా ఉన్నా, పశ్చిమోత్తర ప్రాంతీయుల్లా చక్కటి దృఢశరీరాలు కలిగి కంటికింపుగా కనబడతారు. వాళ్ళ స్త్రీలు పొడవుగానూ సన్నగానూ, ఉండి మంచి అంగసౌష్ఠవంతో చాలా అందంగా ఉంటారు. వాళ్ళ నడకలో చురుకుదనం, స్వేచ్ఛ, వాళ్ళ ముఖంలో ఉట్టిపడుతూన్న స్వాభావికమైన ఠీవి, స్వాతిశయం చూడగా వాళ్ళు నలుపురంగు గల ఇంగ్లీషు వనితల్లా నాకు కనిపించేరు.

భర్త వంటకుండను పొయ్యిమీదికి ఎక్కించేడు. అక్కడే కూచుని వెదుళ్ళు చీల్చి, బద్దలతో బుట్టలు అల్లు తున్నాడు. అతని భార్య చిన్న అద్దం ముందుంచుకొని అందులో తన ముఖాన్ని చూసుకొని, తడిగుడ్డతో దాన్ని మాటిమాటికి బాగా తుడుచుకొంటూ ఎంతో శ్రమపడు తోంది. ముఖం తుడుచుకున్నాక, పైనున్న బట్టల మడతలు సరిజేసుకొని, ధూళిని ఒకసారిని దులుపుకొని, ఠింగురంగా అని హుషారుగా తన భర్త దగ్గరకువెళ్ళి అతని ప్రక్కనేకూచుని, అప్పటప్పట అతనికి సహాయం చేస్తోంది.

వీళ్ళే నిజంగా పృథ్వీమాత బిడ్డలు. ఏ గడ్డమీదో జన్మించి, రోడ్లప్రక్క ఇక్కడా, అక్కడా, ఎక్కడపడితే అక్కడ జీవిస్తూ, ఎక్కడో ఓ చోట మరణించే వీళ్ళే నిజమయిన కష్టజీవులు. రాత్రింబవళ్ళు ఆరుబయట విశాల ఆకాశం క్రింద, ధారాళమైన గాలీ, వెలుతురులో, కటిక నేల మీద ఒక విశిష్టమైన జీవితాన్ని గడుపుతారు. అందులో పని పాటులు, ప్రేమ, పిల్లలు, గృహకృత్యాలు అన్నీ ఉంటాయి.

వాళ్ళు ఒక్క క్షణంకూడా సోమరిగా ఉండరు. ఎల్లప్పుడూ ఏదో పని చేస్తూనే ఉంటారు. ఒక స్త్రీ తనతాలూకు పని పూర్తవగానే మరో వనిత దగ్గరకు వెళ్ళి జుట్టు ముడివిప్పుకుని, తనంతటతనే చిక్కు తీసుకుని, దువ్వుకొని, జడ అల్లుకుంటుంది. అప్పుడు అక్కడ స్త్రీలు వారి మూడు గుడిసెల లోని కుటుంబ వ్యవహారాలు గురించి ముచ్చటించుకుంటూన్నట్లు ఈ దూరంనుంచి ఖచ్చితంగా చెప్పలేనుగాని గాఢంగా అనుమానిస్తున్నాను.

ఈ రోజు ఉదయాన ప్రశాంతంగా ఉన్న ఆ మరాఠీ గుడిసెల దగ్గర పెద్ద అల్లరి బయలుదేరింది. అప్పుడు ఎనిమిదిన్నరో తొమ్మిదో అయింది. గుడిసెల కప్పులమీద, చింకి రొజాయీలను, చింకి బొంతలనూ పక్కగుడ్డలనూ ఎండలో ఆర వేసుకుంటున్నారు. పందులు పిల్లలతోసహా ప్రక్క గోతిలో ఒక గుట్టకుప్పలా పడుకున్నాయి. అక్కడున్న రెండు కుక్కలు వాటిమీదపడి, నానా గొడవచేసి వాటిని లేవ

గొట్టి ఆహారం వెతుక్కోవాలని బయటికి తగిలేస్తున్నాయి. రాత్రల్లా చలితో బాధపడి ఉదయపు ఎండలో హాయిగా చలికాగుతూ పడుకొన్న తనకు సుఖభంగం కలిగించినందు లకు ఆ పందులు ఆగ్రహాన్ని అరుపులద్వారా ప్రకటిస్తూ పోయేయి. నేను ఉత్తరం వ్రాస్తూ, పరాగ్గా అటు కేసి చూసే సరికి ఒ పెద్ద అల్లరి హఠాత్తుగా ప్రారంభమయింది.

అప్పుడు నేను లేచి కిటికీ దగ్గరకు వెళ్ళాను. చూడగా, ఆ మరాఠి గుడిసెలచుట్టూ జనంమూగిఉన్నారు. హోదాగా కనబడుతూన్న వ్యక్తి ఒకడు, చేతిలో కర్రతిప్పుతూ ఏవో ఘాటయిన మాటలు విసురుతున్నాడు. ఆ మరాఠీలు పెద్ద భయంతో వణికిపోతూ, ఏదో సంజాయిషీ చెప్పుకోటానికి ప్రయత్నిస్తున్నట్లు కనబడుతున్నారు. ఆ దృశ్యాన్నిబట్టిచూస్తే ఆ చుట్టుప్రక్కల ఏవో దుస్సంఘటనలు సంభవించినట్లు, పోలీసు ఆఫీసరు పరిశోధన నిమిత్తం అక్కడికి వచ్చినట్లు అర్థం అయింది.

అంతవరకూ ఇక్కడ స్త్రీ అలాకూచుని తొందర తొందరగా వెదురు బద్దలు గీకుతూ, ప్రక్కను అంత గొడవ జరుగుతున్నా ఏం జరగనట్లూ, ఒంటరిగా ఉన్నట్లూ, ప్రశాం తంగా ఉంది హఠాత్తుగా ఆమెలేచి పోలీసు ఆఫీసరు దగ్గరకు విసురుగా వెళ్ళి, కోపోద్రేకంతో చేతులు అతని ముఖం మీదే చకచకా త్రిప్పుతూ, పెద్ద గొంతుపెట్టి తనమనస్సులో ఉన్నది కాస్తా అతనితో చెప్పింది. రెప్పపాటు కాలంలో ఆ పోలీసు

ఆఫీసరు ఉద్రేకం మూడొంతులు అణగారిపోయింది. ఆ ఆఫీసరు తన ఆక్షేపణను ఒకటి రెండుమాటలతో శాంతంగా తెలియ చేద్దామని ఎంత ప్రయత్నించినా, అవకాశం దొరకక శృంగ భంగం అయి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

కొంతదూరం వెళ్ళి సురక్షిత ప్రదేశంలో ఆగి, వాళ్ళ కేసి తిరిగి గట్టిగా చప్పట్లుకొట్టి ఇలా అన్నాడు: "ఇదుగో! మీకు మళ్ళా నేచెప్పేదేమంటే, మీరందరూ ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి!"

ఆతని హెచ్చరిక విన్నాక ఆ మరాందండు గుడిసెలు పీకేసి, చాపిలు వెదుళ్ళు కట్టేసుకొని, మూటాముల్లెతో పిల్లా పాపను, పందుల్ని వెంటబెట్టుకుని తక్షణం మరో చోటికి వెళ్ళిపోతారని అనుకున్నాను. కాని అటువంటి చిహ్నం ఇప్పటివరకూ కూడా ఏమీ కనిపించ లేదు. ఎప్పటి మాదిరిగానే వెదుళ్ళు చీల్చుకుంటూ, వంటలు చేసుకుంటూ, సింగారించుకుంటూ నిశ్చింతగానే ఉన్నారు.

షాజెద్‌పూర్, ఫిబ్రవరి 1891.

మా ఎస్టేటు కార్యాలయంలో ఒక భాగంలో పోస్టా ఫీసు ఉన్నది. అది ఇక్కడే ఉండడం మాకు చాలా సమపా యంగా ఉన్నది. కారణం మరేంలేదు. మాకు వచ్చిన ఉత్త రాలు తొందరగా బట్వాడా అవుతున్నా... పోస్టుమాస్టారు పిచ్చాపాటీకి నాదగ్గరకు సాయంత్రం ... స్తున్నాడు.



అతడు చెప్పే కట్టుకథలూ, లోకాభిరామాయణం వినడం అంటే సరదాగా ఉంటూన్నది నాకు. జరగటానికి వీల్లేని సంగతులనుకూడా జరిగినట్టుగానే, కళ్ళకు కట్టినట్లు అతి గంభీరంగా చెబుతాడు.

నిన్న, అతి పవిత్రమైన గంగానదిని ఈ ప్రాంతంలోని ప్రజలు ఎంత భక్తి ప్రపత్తులతో పూజిస్తారో, హృదయాల్లో ఎంత గాఢంగా నిలుపుకుంటారో చెప్పడం మొదలెట్టాడు. వాళ్ళ బంధుకోటిలో ఎవడయినా మరణిస్తే, ఆ చితాభస్మం తీసుకుని వెళ్ళి గంగానదిలో కలిపేందుకు వాళ్ళకు ఆర్థిక స్తోమత లేకపోయినట్లయితే, మండుతూన్న చితినుంచి అతని అస్థిక చిన్నదానిని తీసి, భస్మంచేసి, గంగాజలాన్ని ఎప్పుడయినా ఒకప్పుడు త్రాగిన వ్యక్తి వాళ్ళ యింటికి వచ్చేవరకు దాన్ని దాచి ఉంచుతారట. జాహ్నవీ తోయాన్ని పానం చేసిన ఆ వ్యక్తికి, ఆ చితాభస్మం ఓ చిటికడు అతనికి తెలియకుండా తదితర సుగంధ ద్రవ్యాలతో మిళితంచేసి తాంబూలంలో పెట్టి వేసుకునేందుకు మామూలుగా ఇస్తారట. బంధువు అది అతని కడుపులోకి వెళ్ళగానే మరణించిన బంధువు చితాభస్మం పవిత్ర గంగాజలంలో కలిపినట్లుగానూ, జన్మ ధన్యం అయినట్లుగానూ భావించి సంతృప్తి పొందుతారట.

పోస్టుమాస్టారు చెప్పినదంతా విన్నాక మందహాసం చేస్తూ "మీరు చెప్పినది నిశ్చయంగా కల్పించినదే అయి ఉంటుంది" అ[illegible] నేను. అతను ఓ క్షణంఆగి దీర్ఘంగా ఆలోచిం[illegible]వుతే అవొచ్చు!" అన్నాడు.



త్రోనలో, ఫిబ్రవరి 1891.

మేం మహానదులను దాటి, ఇప్పుడే ఒక చిన్న నది లోనికి ప్రవేశించాం. పల్లెస్త్రీలు నదీజలాల్లో స్నానంచేస్తూనో, బట్టలు ఉతుక్కుంటూనో ఉన్నారు. కొందరు మగువలు, ముఖాలనిండా ముసుగులు లాక్కొని, నిండిన బిందెలను ఎడం చంకల్లో పెట్టుకొని, కుడిచేతులు స్వేచ్ఛగా ఊపుకుంటూ, నీరు కారుతున్న చీరలతో ఇళ్ళకు పోతున్నారు. పిల్లలు ఒంటినిండామట్టిపూసుకుని, ఉత్సాహంగాఆడుకుంటూ ఒకరిమీద ఒకరు నీళ్ళు జల్లుకుంటున్నారు. వారిలో ఒకడు రాగం గురించి ఏమీ బాధపడకుండా ఏదో పాట పాడుతున్నాడు.

ఎత్తుగా ఉన్న ఆ కట్టమీద కుటీరాల పైకప్పులు, వెదురుపొదల అగ్రాలు దృగ్గోచరమవుతున్నాయి. ఆకాశం స్వచ్ఛంగావుంది. సూర్యుడు చక్కగా ప్రకాశిస్తున్నాడు. మేఘశకలాలు దూదిపింజల్లా దిఙ్మండలానికి అంటుకొని ఉన్నాయి. గాలి కొంచెం వేడిగావుంది.

ఈ చిన్న నదిలో ఎక్కువ పడవలు లేవు. ఎండుపుల్లలు, వ్రేళ్ళతో నిండిన డింగీలు మాత్రం కొన్ని, లసిన నీటి ధ్వనులకు అనుగుణ్యంగా, నీరిగ్గా కదుల్తూపోతున్నాయి. నది ఒడ్డున, వెదురుబొంగుల మధ్యగా జాలర్ల వలలు ఆరేందుకై వ్రేలాడగట్టి వున్నాయి. ప్రతిచోటా ఆనాటిపనులు పూర్తయినట్లుగా అగపడుతున్నాయి.

చూహాలీ, జూన్ 1891.

పడవ టాపుమీద ఓ ముప్పావుగంటకుపైగా కూచుని ఉన్నాను. అంతలో పశ్చిమాన మబ్బులు దట్టంగా క్రమ్ము కున్నాయి. అవి నల్లగా, దొర్లుకుంటూ తుకాతుకలవుతూ, మధ్యమధ్య మెరుపుల కాంతినిచూపిస్తూ, పరుగెడుతున్నాయి. చిన్న పడవలన్నీ సురక్షిత ప్రదేశంలోకి పరుగులుపెట్టి, లంగర్లు దించుకొన్నాయి వ్యవసాయ కూలీలు, కోసిన కంకుల్ని తీసుకొని నెత్తిమీద పెట్టుకొని ఇళ్ళకు పరుగులు పెట్టారు. వాళ్ళని ఆవులు వెంబడించేయి. వాటి వెనుకే తోకలు ఎత్తుకుని ఛంగున ఎగురుతూ పెయ్యలు పరుగెడు తున్నాయి

అప్పుడు భయంకరమైన మేఘగర్జన వినబడింది. దుర్వార్త తీసుకువచ్చే దూతల్లా ఒగర్చుకుంటూ మేఘ శకలాలు పశ్చిమదిశనుంచి పరుగులు పెట్టుకుంటూ రాసాగేయి. చివరికి ఉరుములు, మెరుపులు, వర్షం అన్నీకలసి పెద్ద గాలి వానక్రింద తయారయి, వెర్రి పకీరులా గెంతుతూ నానా భీభత్సం చేయసాగేయి. వెదురు పొదలను క్రిందకువంచి ఒకసారి తూర్పుకేసి, మరొకసారి పడమటకేసి నేలను ఊడ్చు స్తూన్న ఝుంఝూమారుతం బాధ భరించలేక ఆ వెదురు పొదలు మొర్రలు పెడుతూన్నట్లుగా ఉన్నాయి.

ఆ తుఫాను పాములవాని నాగస్వరంలా అన్నిటిమీదా దాని ప్రభావాన్ని చూపుతూ, పడగలు విప్పిన పాములలా

ఉన్న ఉత్తుంగ కెరటాలను విపరీతంగా ఆడిస్తోంది. ప్రపంచాన్న తా 'మేఘాలవెనుక దంచి గుండాపిండీ చేస్తున్నట్లుగా ఉరుములు నిధీవిరామం లేకుండా ఉరుముతున్నాయి.

తెరచిన కిటికీలోపలి అంచుకు గెడ్డాన్ని ఆనించుకొని, గాలికి దూరంగావుండి భయంకరంగావున్న ఆ తుఫాను చెలగాటంలో పాల్గొనటానికి నా ఆలోచనలకు అనుమతి ఇచ్చాను. హఠాత్తుగా విడచి పెట్టబడ్డ బడిపిల్లల్లా అవన్నీ ఒక్క ఉరుకున ఉరుకులు పెట్టుకుంటూ బయటికి పోయేయి. అకస్మాత్తుగా లోపలకు కొట్టిన వర్షంజల్లుకు నేను పూర్తిగా తడిసిపోయేను. అందుచేత కిటికీని, నా కవితాభావనలను మూసి, చీకటి కోణంలావున్న లోపలకుపోయి, పంజరంలో బంధింపబడ్డ పక్షిలా ఉండవలసి వచ్చింది.

షాజెద్‌పూర్, జూన్ 1891.

మా పడవను కట్టిన గట్టునుంచి, అదో రకమయిన పరిమళం పచ్చగడ్డిలోంచి గుభాళిస్తోంది. నేలమీంచి వస్తోన్న వేడి పొగల్లు నా శరీరానికి తగులుతున్నాయి. చైతన్యవంత మయిన పృథ్వి నునువెచ్చని శ్వాసను అనుభవించాలి.

లేత వరిచేలు పైరుగాలిలో నాట్యం చేస్తున్నాయి. బాతులు నీళ్ళల్లో వాళ్ళ తలలు ముంచుకొని, ముక్కులతో ఈకలను పరిశుభ్రపరచు కుంటున్నాయి. నీటిలో పోతూన్న పడవతాలూకు వ్యథాభరిత ధ్వని తప్ప అక్కడ మరో ధ్వని లేదు.

అక్కడకు దగ్గరలోనే రేవుఉంది. పడవ తిరిగి రావటం కోసమై అనేకమంది అక్కడవున్న వటవృక్షం కింద మూగి, ఎదురుచూస్తూ ఉన్నారు. పడవవచ్చి రావడంతోనే ఆత్రుతతో ఒకళ్ళను ఒకళ్ళు కుమ్ముకుంటూ ఎక్కసాగేరు. గంటల తరబడి దాన్నిచూస్తూ ఆనందించేవాణ్ణి. నదికి ఆవలిఒడ్డునగల పల్లెలో ఈరోజు సంతరోజు. అందుచేతనే ఆ రేవు అంత సందడిగాను, జనసమ్మర్దంగానూ వుంది. కొందరు గడ్డిమోపులను, కొందరు బుట్టలను, కొందరు ఖాళీ గోనెసంచుల్ని మోసుకు వెళ్ళుతున్నారు. సంతకు వెళ్ళేవారు వెడుతున్నారు; వచ్చేవారు వస్తున్నారు. ఆ విధంగా ఈ నిశ్శబ్ద మిట్ట మధ్యాహ్నన, జనప్రవాహం మెల్లిగా ఈ నదిగుండా ఆ రెండు గ్రామాల మధ్య ప్రవహిస్తోంది.

మన దేశంయొక్క పంటపొలాలమీదా, నదీతీరాల్లోను, వినీలాకాశంలోను, సూర్యరశ్మిలోనూ విషాదచ్ఛాయలు ఎల్లప్పుడూ ఎందుకు తిరుగాడుతుంటాయో అని ఆశ్చర్యపడుతున్నాను. దానికి కారణం మనకు ప్రకృతే అన్నిటికంటే తిముఖ్యమవటం అని తేల్చుకున్నాను. ఆకాశం నిర్మలంగా ఉన్నది పొలాలకు పరిమితిలేదు. సూర్యుడు వాటిని తన ఉజ్వల కాంతిపుంజంలో సమైక్యం చేస్తున్నాడు. వీటిమధ్య మానవుడు ఎంతో అల్పంగా గోచరిస్తాడు. అతడు వస్తాడు, వెళ్ళిపోతాడు. ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకుపోయే రేవు పడవ మాదిరిగానే _ అతని మాటలు గొణుగుడు పాటల ప్రతిధ్వని వినబడుతుంటాయి. తుచ్ఛమైన కోరికల వెంబడి

ఎలా అతను పరుగులు పెడతాడో, ప్రపంచ వ్యాపార కేంద్రాల్లో గోచరిస్తుంది. ఈ విశ్వంయొక్క బ్రహ్మాండమయిన ఒంటరితనంమధ్య మానవుని చేతలు, కాంక్షలు ఎంత దుర్బలంగా, ఎంత క్షణభంగురంగా, ఎంత ఘోర నిరర్థకంగా కనబడతాయి! దూరాన నదికడ్డంగాగల పొలాల అంచున బారులుతీర్చి ఉన్న చెట్ల నైలిమను నిర్నిమేషంగా చూస్తూ, సుందర సువిశాల నిష్కల్మష ప్రకృతియొక్క ప్రశాంత నిశ్శబ్ద గంభీరతకూ — తుచ్ఛమై, వ్యథాభరితమై స్పర్థలతో సతమతమైన మన దైనందిన చింతలకూ — మధ్య గల వ్యత్యాసం ఊహించుకోగా, ఆశ్చర్యం కలిగింది.

ఎక్కడయితే ప్రకృతి ఎప్పుడూ దాగి ఉంటుందో, పొగమంచు, మబ్బు, హిమం, అంధకారం అడుగున భయంతో ముడుచుకుపోయి ఉంటుందో, అక్కడే మానవుడు యజమానిని అనుకొని అధికారాన్ని చెలాయిస్తాడు. తన కోరికలు, తన పనులు, స్థిరమైనవని అనుకుంటాడు. వాటికి శాశ్వతత్వం సమకూర్చ కాంక్షిస్తాడు. భావితరాలకేసి దృష్టి సారిస్తాడు. స్మారక చిహ్నాలు నెలకొల్పుతాడు. స్వీయచరిత్రలు వ్రాస్తాడు. మరణించిన వారికి సమాధులు కట్టిస్తాడు. ఈ విధంగా క్షణంకూడా తీరికలేకుండా సంచరిస్తాడు. ఇటువంటి స్మారకచిహ్నాలు ఎన్ని మట్టిపాలయ్యాయో, పేర్లుకూడా ఎలా స్మృతిపథంనుంచి చెరిగిపోయాయో ఆలోచించటానికి వారికి అవకాశం ఏదీ!

షాజెద్‌పూర్, జూన్ 1891.

నది ఒడ్డున పెద్ద, లావైన ఓడస్తంభం ఒకటి పడి ఉన్నది ఒంటిమీద గుడ్డయినా లేకుండా ఆడుకుంటూన్న పల్లెటూరి పెంకి కుర్రాళ్ళు అక్కడకు చేరి, 'చాలాసేపు సంప్రతించుకున్న తరువాత, ఆ ఓడస్తంభాన్ని తప్పెటలు తాళాలతో, బొబ్బలతో దొర్లించుకుని వెళ్ళగలిగితే, అది మంచి ఉషారయిన సరిక్రొత్త ఆట అవుతుందనే నిశ్చయానికివచ్చేరు. నిశ్చయానికి రానడం తడవుగా వెంటనే అమల్లోకి పెట్టేస్తారు. "శెభాస్, తమ్ముళ్ళూ! అందరంకలసి తోద్దాం! కానియండి! హుప్! హుప్!" అంటూ ఆ ఓడకొయ్యని దొర్లించుకుపోతున్నారు. అది ఒక్కొక్క దొర్లు దొర్లుతూంటే, భూనభోంతరాలు దద్దరిల్లేటట్లు నవ్వసాగేరు.

వాళ్ళలో ఒక్క అమ్మాయి వైఖరిమాత్రం చాలా భిన్నంగా కనుపించింది. సహవాసాన్ని అపేక్షించి మగపిల్లలతో ఆడుకుంటున్న దేశాని గోలతోనూ, కష్టంతోనూ కూడుకున్న ఈ ఆటను ఆమె నిరసన పూర్వకంగా చూసింది. ధైర్యంగా ఆ ఓడస్తంభంమీద మారుమాటాడకుండా వెళ్ళి కూచుంది.

ఆ అరుదైన గొప్ప ఆట హఠాత్తుగా అలా ఆగిపోవటమే! కొందరు ఆటగాళ్ళు అది మంచిదికాదన్న భావనతో విడిచిపెట్టడానికి ఇచ్ఛగిస్తూన్నట్లు కనబడుతున్నారు. అక్కడ

నుంచి కొందరు కొంచెందూరం నడచివెళ్ళి, కదలకుండా, గంభీరంగా కూచున్న ఆ కొంటెపిల్లకేసి కొరకొరా చూసేరు. వారిలో ఒక పిల్లవాడు ఆమెను క్రిందకు త్రోసివేస్తానని భయపెట్టాడు. కాని అదికూడా నిశ్చలంగా, నిర్లక్ష్యంగా కూచుని ఉన్న ఆమెను కదల్చలేకపోయింది వాళ్ళలో పెద్దకుర్రవాడు ఆమె దగ్గరకువచ్చి. విశ్రాంతి తీసుకోటానికి రాగా అనువయిన స్థలాలు మరికొన్నింటిని ఆమెకు చూపి లేచిపొమ్మన్నాడు అందుకు ఆమె వెళ్ళనని గట్టిగా తల ఊపేసి, చేతులు తెచ్చి ఒళ్ళోవుంచుకొని, ఒకసారి సర్దుకుని, కదలకుండా గట్టిగా పాతుకుని కూచుంది. ఏమిచేసినా నిరుపయోగం అవడంతోనే, ఆ కుర్రాళ్ళు బలప్రయోగానికి దిగి పూర్ణజయం పొందేరు.

మరోసారి హర్షధ్వానాలు మిన్నుముట్టేయి. ఓడ సంబరం ఎంతో వైభవంతో దొర్లుకు పోతూండగా, ఆ అమ్మాయికూడా తన గర్వాన్ని, గొప్పతనాన్ని విడనాడి, అర్థరహితమైన ఆ ఉద్రేకంలో తనూ పాల్గొంటున్నట్లు అభినయించింది. మగపిల్లలకు ఆడుకోవడం సరిగ్గా తెలియదనీ, వాళ్ళు ఉత్త పెంకిఘటాలనీ, ఆమె అభిప్రాయపడుతున్నట్లు ఆ దృశ్యాన్ని చూసినవారు ఎవరయినా గ్రహిస్తారు. ఆమెని అందుబాటులో ఏదయినా పసుపురంగు మట్టిబొమ్మ – నెత్తికు పెద్ద జుట్టుముడితోఉన్నది – దొరికివుంటే బొమ్మలాట ఆడుకుంటూ చక్కగా ఉండిపోయేదిగాని బుద్ధీ జ్ఞానంలేని ఈ మగపిల్లలతో ఈ పిచ్చి పిచ్చి ఆటలు ఆడటానికి సమ్మతించేదా?

ఆ పిల్లలకు హఠాత్తుగా అద్భుతమైన మరో క్రొత్తఆట మెరుపులా స్ఫురించింది. ఇద్దరు కుర్రాళ్ళు మూడో కుర్రవాణ్ణి, కాళ్ళు ఒకరు, చేతులు ఒకరు పట్టుకొని గబగబా ఊపసాగేరు. ఇదంతా ఓ పెద్ద నవ్వులాటలా వ్యవహారంలా వాళ్ళకు ఉన్నట్టుంది. అందరూ అది చూసి ఉత్సాహంతో ఉప్పొంగిపోతున్నారు. గాని ఆ బాలికమాత్రం ఆ ఆటను చూడజాలక అసంతృప్తితో ఆ ఆటస్థలాన్ని వదిలేసి, ఇంటికి పోయింది.

అప్పుడు అక్కడ ఒక ప్రమాదం సంభవించింది ఊపబడుతున్న పిల్లవానిని క్రింద జారవిడిచేరు, నేలపడిన ఆ కుర్రవాడు అలిగి, దూరంగాపోయి, గడ్డిమీద పడుకుని తల క్రింద అడ్డంగా చేతులు పెట్టుకొని, ఈ దుర్మార్గ హృదయ రహిత ప్రపంచంతో తను ఏ సంబంధం పెట్టుకోదలచ లేదనీ, ఈ విధంగానే, ఒంటరిగా తలక్రింద చేతులుంచుకొని, ఎల్లప్పుడూ పడుకొని నక్షత్రాలను లెఖ్ఖిస్తూ మేఘాల ఆటలను తిలకిస్తూ ఉండిపోతానని తెలియజెప్పుతూన్నట్లు నటిస్తున్నాడు.

ఆ కాలంలో ఆ విధంగా ప్రపంచంమీద విరక్తి కలిగి, సన్యసించ దలచుకున్న ఆ కుర్రవాని ఆలోచనకు, వాళ్ళలో పెద్దకుర్రవాడు బాధపడి విచారక్రాంతుడైన అతని దగ్గరకు పరుగున వెళ్ళి, అతని శిరస్సు తన తొడలమీద ఉంచుకొని బుజ్జగించడం ప్రారంభించేడు. "రా రా నా చిట్టి తమ్ముడూ ఇంటికి! లేరా నా బుల్లి తమ్ముడూ! మేం నిన్ను బాధించేమా చిట్టి తమ్ముడూ?" ఆ బ్రతిమిలాడ్డం అయిా

అవకాశమునుపే, వాళ్ళిద్దరూ ఒకరి చేతులు ఒకళ్ళు పీక్కుంటూ, లాక్కుంటూ కుక్కపిల్లల్లా ఆడుకోవటం నేను చూశేను. రెండు నిముషాలు గడిచాయో లేదో, ఆ చిన్నపిల్లవాడు మళ్ళా ఊగుతున్నాడు.

షాజెద్‌పూర్, జూన్ 1891.

గతరాత్రి నేనొక అద్భుతమైన కలగన్నాను. కలకత్తా నగరం అంతా అదోరకమయిన భయానక మాయాజాలంతో కప్పబడినట్లు ఉంది గృహాలు అన్నీ దట్టమైన, నల్లని పొగ మంచు గుండా మసక మసకగా కనబడుతున్నాయి. ఆ పొగ మంచు తెరలలోంచి విచిత్ర సంఘటనలు జరుగుతున్నాయి.

అద్దెకు తీసుకున్న గుర్రపుబగ్గీమీద నేను పార్కు స్ట్రీటులోంచి వెళుతున్నాను సెయింటు సేవియర్స్ కాలేజి దాటగానే, ఆ పొగమంచు మరి మరీ సాంద్రమయి, ఎదుట వస్తువులుకూడా కనిపించటం కష్టం అయిపోయింది. అప్పుడు నా మనస్సులో ఒక భావం స్ఫురించింది. కలకత్తా నగరంకు మాంత్రికుల దండు ఒకటి వచ్చిందని, వాళ్ళకు డబ్బు ఇచ్చినట్లయితే, ఇలాంటి విచిత్రాలు, మాయాజాలాలు, ఎన్నయినా చూపించగలరు అనుకున్నాను. నేను మా జోరశాంకో గృహానికి చేరుకునేసరికి, ఈ మంత్రగాళ్ళు అక్కడకూడా ప్రవేశించినట్లు తెలుసుకున్నాను. వాళ్ళు చూడటానికి అసహ్యంగా ఉన్నారు. మంగోలియా జాతికి చెందిన ఈ మంత్ర

గాళ్ళకు, చిన్నమీసం, కొద్దిపాటి వెంట్రుకలుగల పొడుగాటి గెడ్డం వున్నాయి. వాళ్ళు మనుష్యులను పెరిగేటట్లు చేయగలరు. కొంతమంది ఆడపిల్లలు పొడవు అవాలని కోరుకున్నారు. ఆ మాంత్రికుడు మంత్రించిన భస్మాన్ని కొంత వాళ్ళ శిరస్సులమీద జల్లేసరికి, మాస్తాంపగానే వాళ్ళు పొడుగు ఎదిగిపోయారు నేను కలుసుకున్న ప్రతి ఒక్కరితో "ఇది చాలా అద్భుతంగావుంది – అంతా ఒక స్వప్నంలా వుంది" అంటూ పునః పునః చెబుతూనే ఉన్నాను.

అంతలోనే ఎవరో ఒకరు మాఇంటిని పెద్దదిగా చేయాలని ప్రతిపాదించేరు. ఆ మాంత్రికులు చేస్తామని అన్నారు. ప్రాథమికంగా కొన్ని భాగాలు తీసుకున్నారు. వాటిని పడగొట్టడం పూర్తయింది. అప్పుడు డబ్బు ముందుగా ఇవ్వమని పట్టుబట్టి కూచున్నారు. లేకపోతే మిగతా పని ప్రారంభించమని అన్నారు. మా కేషియరు వాళ్ళ మొండితనానికి చాలా తీవ్రమైన ఆక్షేపణ తెలియజేశాడు. 'పని పూర్తవకుండానే డబ్బు ఎలా చెల్లిస్తాం' అని ప్రశ్నించాడు. దానికి ఆ మాంత్రికులు ఆగ్రహావేశులై, ఆ ఇంటిని ఇష్టంవచ్చినట్లు భయంకరంగా త్రిప్పేశారు. దాంతో మనుష్యులు, ఇటుకలు, సున్నం బాగా ఒకదానితో ఒకటి దగ్గరగా కలసినట్లయ్యాయి. మనుష్యుల శరీరాలు గోడల లోపలకు ఉండిపోయి, భుజాలు, తలలు మాత్రం బయటకు కనబడుతున్నాయి. అదంతా పూర్తిగా పైశాచిక కృత్యంలా కనబడింది. మా పెద్దన్నగారితో ఇలా అన్నాను. "అది ఎలాంటిపనో చూడు అన్నయ్యా! మనలను

రక్షించమని భగవంతుణ్ణి ప్రార్థించడం ఉత్తమం." నేను వాళ్ళని కఠోరంగా శపించటానికి నా యావచ్ఛక్తిని వినియోగించేను. నా హృదయం పగిలిపోయినట్లయింది. గాని నోటంట మాట పెగలందే! అంతలో నాకు తెలివి వచ్చేసింది!

ఈ కల వింతగా లేదూ? కలకత్తా నగరం శనిగాడి చేతుల్లోపడి అపవిత్రమైన భాగమంతయొక్క గాఢాంధకారంలో భూతంలా పెరిగిపోవటం తమాషాగావుంది!

పాజెన్‌పూర్, జూన్ 1-91.

నన్ను చూట్టానికి ఈ ఊరి ఉపాధ్యాయులు నిన్నను వచ్చారు. వాళ్ళందరూ ఎంతోసేపు కదలకుండా అలా కూచుండిపోయారు. అదేం కర్మోగాని, మాటాడ్డానికి ఒక్క మాటకూడా నాకు దొరకలేదు. అయిదేసి నిముషాలకు ఒకటో అరో ప్రశ్న కష్టంమీద అడగగలిగేవాణ్ణి. అడగడం తడవుగా, వాళ్ళు ముక్తసరిగా తక్కిన సమాధానాలు ఇస్తున్నారు. ఇహ నాకు ఏమీతోచక పెన్ను గిరగిరా త్రిప్పుతూ తలగోక్కుంటూ ఖాళీగా కూచున్నాను.

ఎట్టకేలకు పంటలుగురించి ఓ ప్రశ్న ధైర్యంచేసి వదిలేను పాపం, వాళ్ళు ఉపాధ్యాయులు అవటంచేత పంటలు గురించి వాళ్ళకు ఏమీ తెలియలేదు.

వాళ్ళ బడిపిల్లలు గురించి అడగవలసిన ప్రశ్నలన్నీ ఇదివరకే అడిగేశాను. అయినా వాటినే తిరిగి ప్రారంభించాను.

స్కూల్లో ఎంతమంది విద్యార్థులున్నారు? 'అని ప్రశ్నించేను.' ఒకాయన ఎనభై అని, మరొకాయన వందని, ఇంకోఆయన డెబ్భయిఅయిదనీ జవాబులిచ్చేరు. వాళ్ళలో వాళ్ళు పోట్లాడు కుంటారేమో అనుకున్నాను గాని అలా జరుగలేదు. వాళ్ళ భేదాభిప్రాయాల్ని వాళ్ళలో వాళ్ళే సరిపెట్టుకుని ఊరు కున్నారు

ఒక గంటా ముప్ఫయి నిమిషాల తదనంతరం నా దగ్గర శలవుతీసుకుని వెళ్ళిపోదామని ఎందుకు అనుకున్నారో నేను చెప్పలేను ఆ పని ఓ గంటక్రితనే వాళ్ళుచేసివుంటే సమంజసంగావుండేది లేకుంటే పన్నెండు గంటల తరువాత అయినా బాగుండిపోయేది. వాళ్ళు ఆ నిర్ణయం ఒక క్రమపద్ధతిలో తీసుకున్నదికాక సమయానుకూలమైనది అని అర్థం అవుతోంది.

షాజెద్‌పూర్, జూలై 1891.

మేము దిగిన ఈ స్థలంలో మరొక పడవకూడా ఉన్నది. దాని ముందరే ఒడ్డున పల్లెపడుచుల గుంపు ఒకటి ఉన్నది. వారిలో కొందరు ప్రయాణం చేస్తూన్న వారిలా కనబడు తున్నారు. మిగిలినవారు వాళ్ళను సాగనంపుతున్నారు. పసి పాపలు, మేలిముసుగులు, పండుజుత్తులు, అన్నీ ఆ సమూ హంలో కలసిపోయాయి.

వాళ్ళలో, ప్రత్యేకంగా ఒక అమ్మాయి నా దృష్టిని ఆకర్షించింది. ఆ అమ్మాయివయస్సు సుమారు పదకొండు, పన్నెండు సంవత్సరాలుకంటే ఎక్కువ ఉండవు ఉల్లాసం, శరీరదార్ఢ్యం చూస్తే ఆమె పధ్నాలుగు పదిహేను సంవత్సరాలు దాటిన అమ్మాయిలా కనబడుతుంది. ఆమె ముఖం అతి ఆకర్షణీయంగాఉంది. నల్లగా ఉన్నప్పటికీ చూడముచ్చటగా ఉంది. మగపిల్లవాని జుత్తులా ఆమెజుత్తు కురుచగా కత్తిరించబడి ఉంది. ఆ జుత్తులో ఆమె మరీ నిరాడంబరంగానూ, ధారాళంగానూ, చురుగ్గానూ కనబడుతూంది. ఆమె చేతుల్లో బిడ్డ ఉంది. ఆలాగే నావంక నిస్సంకోచంగా ఏదో ఆత్రుతతో, నిర్నిమేషంగా చూస్తోంది. ఆమె చూపులో నిష్కాపట్యం, తెలివితేటలు వెల్లివిరుస్తున్నాయి. పురుషస్థైర్యం స్త్రీమోహనత్వం అపూర్వంగా ఆమెలో ప్రతిఫలిస్తున్నాయి. మగపిల్లవానిలా చురుగ్గానూ, అమ్మాయిలో అందంగానూ ఉన్న ఆ అమ్మాయి అత్యంతాకర్షణీయంగా ఉన్నది. మన వంగదేశం గ్రామీణ స్త్రీలలో అటువంటి ఆకర్షణీయమైన వారు ఉన్నారని నాకు తెలియనే తెలియదు. వాళ్ళ కుటుంబంలో ఏ ఒక్కరూ అతిసిగ్గుతో బాధపడినట్లు కనుపించలేదు. ఒకామె, జుట్టు విప్పుకొని ఎండలో నుంచుని, వేళ్ళతోనే చిక్కుతీసి దువ్వుకుంటూ, పెద్దగొంతుకపెట్టి కుటుంబ విషయాలగురించి ధారాళంగా పడవమీద ఉన్న ఆమెతో మాటాడుతూంది. ఆమెకు ఒక్క ఆడపిల్లతప్ప పిల్లలు లేనట్లు ఆ సంభాషణబట్టి నేను తెలుసుకోగలిగేను. ఆ ఆడపిల్ల శుద్ధ తెలివితక్కువ పిల్లట; దాని ఎలా నడుచుకోవాలో, ఎలా

మాటాడాలో, పరాయి వాళ్ళెవరో, ఆత్మీయులెవరో తెలి యని ఎద్దు మొద్దు స్వరూపంట. గోపాల్ తాలూకు అల్లుడు ఎందుకూ పనికిరాని వాడయిపోయేడని, అందుచేత వాడి కూతురు భర్తదగ్గరకు వెళ్ళ నిరాకరిస్తోందనికూడా వాళ్ళ మాటలువల్ల అర్థమవుతోంది.

ఇహ పడవ బయలుదేరబోతోంది. బలసి సన్నగా ఉన్న అందమయిన బాహువులు, బంగరు గాజులు, నిష్కల్మ షమై కలకలలాడుతూ కాంతు లీనుతూన్న ముఖం, కురుచ జుట్టు-వీటితో శోభిస్తూన్న ఆ అందాల అప్సరస అమ్మాయిని దగ్గరుండి చేయిపట్టుకుని పడవలోకి ఎక్కించేడు. ఆమె పుట్టింటనుంచి అత్తింటికి వెళుతూన్నట్లు నేను దివ్య దృష్టితో కనుగొన్నాను. పడవ వెళ్ళిపోతూండగా అందరు అక్కడ నుంచి, దృష్టిని మాత్రం దాని వెంబడినే పోనిస్తున్నారు. స్త్రీలు కన్నీటిని చీరకొంగులతో తుడుచుకుంటున్నారు కొందరు. ఓ చిన్న అమ్మాయి ఒక వృద్ధస్త్రీ మెడను కావిలించుకొని, భుజంమీద తలపెట్టి నిశ్శబ్దంగా ఏడు స్తోంది. తనతో బొమ్మలాటలు ఆడుతూ, తను అల్లరిచేసి నప్పుడు నాలుగు దెబ్బలు వేస్తూండే ప్రియమైన తన పెద్దక్క వెళ్ళిపోతూన్నదని కామోలు ఆపిల్ల అలా ఏడుస్తూన్నది.

ఆ నదీప్రవాహంమీద ప్రశాంతంగా తేలియాడుతూ పోతూన్న పడవ, ఎడబాటులోగల విషాదాన్ని, మరింత తీవ్రతరం చేస్తోంది. అది మరణ సదృశంగా ఉంది. వెళ్ళిపో తూన్న ఆమె దృష్టి పథంనుంచి తప్పుకోగానే, మిగిలినవాళ్ళు

తుడుచుకుంటూ ఇళ్ళకుపోయి, పనిపాటల్లో నిమగ్నులయ్యేరు నిజానికి ఆ దుఃఖ తీవ్రత కొంతసేపే ఉంటుంది. బహుశా అప్పుడే అది ఊరికి వెళ్ళిపోయిన వారిలోను, ఇక్కడ ఉన్న వారిలోనూ హరించిపోతూండ వచ్చుకూడా. బాధ తాత్కాలికం, మరపు శాశ్వతంగదా! అయినప్పటికీ మరచిపోవడం కాదు నిజమయింది. బాధే నిజమయింది. ఆ యదార్థాన్ని వియోగంలోగాని మరణంలోగాని మనం బాగా తెలుసుకో గలుగుతాం.

కటక్ వెళుతూన్న స్టీమర్‌లో
అగస్టు 1891

నా సంచీ వెనక్కి విడిచిపెట్టి రావడం నా బట్టలు రోజురోజుకీ అసహ్యంగా తయారయి నన్ను తలెత్తుకోనీయకుండా చేయటం—ఆత్మగౌరవం ఉన్నవాడికి దుస్సహంగా ఉన్నాయి. సంచీఉన్నట్లయితే, శిరస్సుమీది కెత్తుకొని ఠీవిగా ఉషారుగా, ఎక్కడకయినా, ఎవరిదగ్గరకయినా వెళ్ళగలిగి ఉండేవాణ్ణి. అది లేకపోబట్టి, మూరుమూలల నక్కుకుంటూ, ఎవరికంటా పడకుండా పోదామనిపిస్తోంది. ఈ కట్టుబట్టలతోనే నిద్రపోతున్నాను. వీటితోనే తిరిగి ఉదయం కనబడుతున్నాను ఇది ఇలా ఉండగా స్టీమరంతా మసితో నిండిపోయింది. పగటిపూట ఉన్న వేడికి ఒళ్ళంతా చెమటతో నిండిపోయి మహాచిరాగ్గా ఉంది. ఆ విధంగా ఎంతోసేపు స్టీమరుమీద గడిపేను. నాతోడి ప్రయాణీకులువిసుగు,విరామం అన్నది ఎరుగని రకం. వారిలో ఒకడు అఘోర్ బాబు అనేవ్యక్తి

ప్రపంచంలో చరాచరుల్లో దేన్ని గూర్చి మాటాడినా నిందించకుండామాత్రం మాటాడలేక పోయేవాడు మరోవ్యక్తి ఉన్నాడు. అతడు సంగీతప్రియుడు. ఆ అర్ధరాత్రివేళ భైరవి రాగం ఆలాపన ప్రారంభించి, ఆ ఆలాపన ఆ సమయంలో చేయకూడదని ఒకవిధంగా కాక అనేకవిధాలుగా నన్ను గట్టిగా ఒప్పించేడు. (భైరవి రాగం తెల్లవారుఝామున చేయాలి).

మా స్టీమరు నిన్న సాయంత్రంనుంచీ కాల్వలో మెరక ప్రదేశానికి తగులుకొని, అలాఉండిపోయింది. ఇప్పుడు అప్పుడే ఉదయం తొమ్మిది దాటింది. ప్రయాణీకులతో క్రిక్కిరిసిఉన్న ఆ స్టీమరు మీది భాగంలో ఒకమూల నానా యాతనలు పడుతూ సగం చచ్చి రాత్రల్లా గడిపేను. స్టీమరులో భోజన సదుపాయాలు చూసేవ్యక్తితో రాత్రి భోజనానికి కొద్దిగా లూచీలు వేచమని చెప్పేను. కొంతసేపటికి కాలీకాల కుండా, పిండిముద్దగానే ఉండి, రూపురేఖలు లేని రొట్టెల్లాంటివాటిని, ఏ కూరా నారాకూడా లేకుండా తెచ్చి ముందుపెట్టాడు తినమని. వాటినిచూచి బాధతోకూడిన ఆశ్చర్యాన్ని నేను ప్రకటించగానే, అతడు చాలా పశ్చాత్తాపపడి, తొందరగా నాలుగు రకాలు తయారుచేయించి భోజనం తెస్తానని అన్నాడు. గాని అప్పటికే అర్ధరాత్రి అవటంచేత, ఆ ప్రయత్నం విరమించమని అతనికి చెప్పి కళ్ళుమూసుకొని ఆ పిండిముద్దనే కొద్దిగా దిగమ్రింగేను. అంతలో అన్నిదీపాలు బాగా వెలగడం, ప్రయాణీకులతో స్టీమరు పైభాగం నిండిపోవడం, నిద్రపోటానికి నేను నడ్డివాల్చడం జరిగేయి.

మీదను దోమలదాటి ప్రారంభమయింది. క్రిందనూ, చుట్టూ బొద్దింకలు పరుగులు పెడుతున్నాయి. నాకాళ్ళదగ్గర అడ్డంగా ఒక ప్రయాణీకుడు పడుకుని ఉన్నాడు. అతని శరీరం నా కాళ్ళకు ఉండి ఉడిగీ తగులుతూనే ఉంది. నాలుగయిదు ముక్కులు బ్రహ్మాండంగా గుర్రు తీయటంలో నిమగ్నమ య్యాయి. దోమల పీడకు నిద్రపట్టని కొందరు, గుడుగుడు (హుక్కా) పీల్చుకుంటూ ఆ బాధ ఓర్చుకుంటున్నారు. వీట న్నిటినీ మించి వినబడుతూంది భైరవి రాగాలాపన-తెల్లవారు ఝాము మూడున్నర దాటుతూండగా కొందరు హడావుడిగా గావు కేకలు పెడుతూ ఒకరినొకరు లేపుకోడం ప్రారంభిం చారు. నాకు నిద్రపట్టలేదు నిరాశతో పక్కమీంచి లేచి పోయి, అక్కడున్న కుర్చీలో కూచుని ఎప్పుడు తెల్లవారు తుందా అని నిరీక్షించసాగేను. ఆ రాత్రిల్లా పీడకలతోనూ, బాధలతోనూ గడచిపోయింది.

స్టీమరు నేలకు బాగా తగిలి ఉండటంవల్ల, బయట పడటానికి ఈ రోజల్లా పడుతుందని ఒకాయన నాకు చెప్పేడు ఆ మాట వినగానే దగ్గుతున్న మరో వ్యక్తిని కలకత్తా తిరిగి వెళ్ళటానికి ఏదయినా స్టీమరు ఉన్నదా అని అడిగేను. అతడు మందహాసం చేస్తూ ఈ దారికి ఇదొక్కటే అని, కావలిస్తే కటక్ చేరేక మళ్ళా దానిమీదే తిరిగి రావచ్చు అన్నాడు. మా అదృష్టకొద్దీ పదీ ఆ ప్రాంతాన అతిశ్రమపై ఆ స్టీమర్ని నీటిలోకి తిరిగి లాగగలిగేరు.

తిరన్

సెప్టెంబరు 1891

బాలియాలో రేవు స్థలం సుందర ప్రకృతితో విలసిల్లు తూంది. నది కిరుప్రక్కల చక్కటి మహావృక్షాలు ఉన్నాయి మొత్తంమీద ఇక్కడ కాల్వపూనాదగ్గర చిన్ననదిని గుర్తుకు తెస్తోంది. ఈ కాల్వే నదిగాని అయినట్లయితే నేను ఇంకా ఎంతో ఇష్టపడి ఉండేవాణ్ణి.

దాని గట్టున కొబ్బరిచెట్లు, మామిడిచెట్లు, నీడల నిచ్చే ఇంకా ఎన్నో రకాలయిన చెట్లూ, బారులు తీర్చి ఉన్నాయి. అందమైన పచ్చగడ్డి ఆ గట్టు మీంచి నెమ్మదిగా నీటి అంచువరకు వ్యాపించింది. ముట్టుకుంటే ముడుచుకుపోయే మొక్కలు. పూలతో ఆ పసిరికమధ్య విరా జిల్లుతున్నాయి. అక్కడక్కడ దేవదారువృక్షాలు ఉన్నాయి. వాటిమధ్య సన్నగాఉన్న ఖాళీల్లోంచి చూస్తే సుదూరానికి వ్యాపించిఉన్న అంతులేని పంటభూములు దృగ్గోచరం అవు తాయి. వర్షానంతరం, లలితమై, ముఖమల్‌లాఉన్న పసిడి పైర్లు చూపరులదృష్టిని ఆకర్షించి. తమ అగాధ. తలాల్లోకి ఆ చూపులను తీసుకుపోతాయి. కొబ్బరి, ఈత తోపుల్లో దాగి, క్రిందికిదిగి తేలియాడుతూన్న నీటిమేఘాల చల్లని నీడ లలో శయనిస్తూన్న చిన్నచిన్న పల్లెలుకూడా కనబడతాయి అక్కడ.

వీటన్నిటిగుండా, పసిరికతో నిండిన రమణీయమైన గట్లమధ్యనుంచి, పక్కప్రక్క అపరిమితంగా పూచిన నీటికలు

వలు ఒత్తులుగా ఎత్తుగా పెరిగిన రెల్లుగడ్డి అందాన్ని హెచ్చి స్తూండగా, నెమ్మదైన ప్రవాహంతో, ఆ కాల్వ మెలికలు తిరుగుతూ, నాజూగ్గా ప్రవహిస్తూపోతోంది.

ఆ కాల్వలోని నీటి మర్మరధ్వని తిరిగి కాలంయొక్క ప్రారంభదశకు చేరుకోలేదు. దరిజేర వీలులేని సుదూర పర్వత గుహాలోగల చిత్ర విచిత్రాలు దానికి తెలియవు అది అనాదినుంచీ ప్రవహించలేదు. పురాతన ప్రపంచం ప్రసా దించిన ఆడపేరుతో పిలువబడుతూ, తన కిరుప్రక్కలగల పల్లె ప్రజలకు తన స్తన్యధారలను అవిరళంగా ప్రసాదించుకుంటూ పోతోంది. మానవనిర్మితమైన పురాతన సరస్సులు సయి తం, ఆమెకంటే ఎక్కువ గౌరవ హోదాలు సంపాదించు కున్నాయి.

ఇప్పటినుంచి నూరేళ్ళు గతించేసరికి గాని గట్లమీద గల వృక్షాలు మహోన్నతస్థాయి నందుకొంటాయి. సరి క్రొత్తగా పాతిన దాని మైలురాళ్ళు, అరిగి ఒరిగి నాచుతో కప్పబడిపోతాయి. దాని తూముల తలుపులమీద చెక్కబడ్డ "1871 సంవత్సరం" గౌరవంగా అదృశ్యమవుతుంది. అప్పుడు నేను తిరిగి నా మునిమనుమనిగా జన్మించినట్లయితే, ఈ కాలవప్రక్కగల కటక్ ఎస్టేటు భూముల్ని చూడటానికి రావ డమే సంభవిస్తే, ఈకాలువగురించి ఆనాడు మరోవిధమయిన అనుభూతి పొందవచ్చు.

షెలీ దా
అక్టోబరు 1841

ఒక పడవతరువాత ఒకపడవ అలా ఈ రేవులోకి వస్తూనేఉంది. పనికోసం గ్రామాంతరాలు వెళ్ళిన పాటక జనం, సంవత్సరపు ప్రవాసానంతరం దసరాపండగ శలవులకు తిరిగి తమతమ స్వగృహాలకు చేరుకుంటున్నారు. వారివెంట, బహుమతులతో నిండిన పెట్టెల్లు, బట్టలు, మోపులుఉన్నాయి. వాటిలో ఓపడవ ఒడ్డును సమీపిస్తూండగా, ఒకవ్యక్తి విస్తీర్ణ మడతలు విప్పిన మస్లినుధోవతి కట్టుకొని, బనియను వేసుకొని, దానిమీద చైనా సిల్కుకోటు తొడుక్కొని, మడతల కండువాని మెడలో వేసుకొని, అక్కడగల పల్లెవైపు నడక సాగించాడు.

గాలితరంగాలు సందడిచేస్తూ వరిపొలాల మీదుగా పరుగులు పెడుతున్నాయి. మామిడి, కొబ్బరి వృక్షాగ్రాలు అంబరాన్ని చుంబిస్తున్నాయి. ఆవల దిఙ్మండలంలో తేలిమబ్బులు తిరుగులాడుతున్నాయి. గాలిలో తాటాకులు అందంగా ఊగుతున్నాయి. ఇసుకతీరంలో రెల్లుగడ్డి పుష్పించ సిద్ధంగా ఉంది. ఆ దృశ్యం ఎంతో మనోజ్ఞంగాఉంది, అమితోల్లాసాన్ని సమకూరుస్తోంది.

ఎక్కడినుంచో వచ్చి అప్పుడే ఇల్లు చేరుకున్న పురుషుని హృదయానుభూతులు, అతనికోసం ఆతృతతో ఎదురుచూస్తున్న అతని ఆత్మీయవర్గం, ఈ శరత్కాల అకాశం,

ఈ సుందరలోకం, ఈ ప్రభాత మందమారుతం, చెట్లు లోనూ, పొదలోనూ, నదిమీది అలల్లోనూ, విశ్వవ్యాప్తంగా ఉన్న సంతోష ప్రకంపనలు ఇవన్నీ ఒంటరిగా ఉండి కిటికీ లోంచి చూస్తూన్న ఈయువకుణ్ణి అనిర్వచనీయ అందంతోను, అమిత సుఃఖంతోనూ, ముంచెత్తాలని కుట్రపన్నేయి. ప్రక్క నున్న కిటికీలోంచి తిలకిస్తూన్న దృశ్యాలు నాలో క్రొం గ్రొత్తకోరికలనురేకెత్తించడమో లేక, పాతకోరికలను క్రొత్త రూపాలతో రప్పించడమో చేస్తూన్నాయి. మొన్న, పడవ కిటికీదగ్గర కూర్చునిఉండగా, రివ్వున ఓచేపడింగీ అలా వెళ్ళి పోయింది. ఆ డింగీలో జాలరి ఏదో పాట పాడుతున్నాడు. అదేమంత రాగవరుసతో పాడుతూన్నది కాదనుకోండి! గాని అది కొన్ని సంవత్సరాలక్రితం రాత్రిని నాకు జ్ఞప్తిచేసింది. అప్పుడు నేను పిల్లవాణ్ణి. పద్మానదిలో పడవమీద మేం వెళ్లు తున్నాం. ఆ రాత్రి సుమారు రెండుగంటలప్పుడు నేను నిద్ర లేచి, కిటికీతలుపులు తెరచి, తల బయటకిపెట్టి చూసేను. నీళ్ళు ఒక్క అలకూడా లేక అతి నిశ్చలంగా ఉండి, పాల వెన్నెల్లో మెరిసిపోతున్నాయి. అప్పుడు ఓ యువకుడు స్వం తంగా డింగీని నడుపుకుంటూ కమ్మగా పాడుకుంటూ పోతు న్నాడు. అంత మధురాతి మధురంగా పాడినపాట నేను ఇది వరకు ఎన్నడూ వినలేదు !

ఈ నాడు, తిరిగి ఆ నాటిపాట స్మృతికివచ్చి మనస్సు అటు పరుగెత్తింది ఆ దినాలమీద మమకారం మళ్ళా ఉద్భ వించింది. జీవితంమీద మరొకవ్యాఖ్య తయారుచేయాలని, ఈ సారి దాన్ని ఉత్తనే అసంతృప్తిగా విడచిపెట్టకూడదనీ

అనుకున్నాను. కావ్యగానం చేస్తూ, పొంగుతూన్న కెరటాల వంపుల్లో తేలియాడుతూ ప్రపంచంలో తిరుగుతూ, మానవాళికి ఆ గానాన్ని వినిపిస్తూ వ్యథాభరిత హృదయాలను ఊరడిల్లచేద్దామనీ-ప్రపంచం నాకోసం ఏమిటి ఉంచిందో, ఎక్కడ ఉంచిందో స్వయంగా వెళ్ళి తీసుకుందామనీ నన్ను లోకం తెలుసుకోవాలనీ లోకాన్ని నేను తెలుసుకోవాలనీ - ఆతృతతో రివురివ్వని పరుగులుపెట్టే పవనాల్లా ప్రపంచంలో చైతన్యంతోనూ యవ్వనంతోనూ గడపాలనీ, కోరిక లీడేరగా, పరిపక్వమయిన వృద్ధాప్యంలో కవిగా జీవించటానికై ఇంటికి తిరిగి జేరుకోవాలనీ, కాంక్షిస్తున్నాను.

ఇది ఉన్నతాశయం కాదా? లోకానికి మేలు సమకూర్చటం అంటే నిస్సందేహంగా ఉత్కృష్టమైనదే గాని నా ప్రస్తుత పరిస్థితిబట్టి నాకు అటువంటి ఆశే కలుగలేదు. ఈ అమూల్యమైన జీవితాన్ని స్వంతంగా సృష్టించుకొన్న కరువు కాటకాలకు బలిచేసి, ఉపవాసాలు, తపస్సులు, తర్కాలతో, లోకానికీ, ప్రజాహృదయాలకు ఆశాభంగం కలుగచేయటానికి నా మనస్సును ఒక నిశ్చయానికి తీసుకురాలేక పోయాను. మానవునిగా జీవించి, మరణిస్తే అంతే చాలు అనుకున్నాను. లోకాన్ని సృష్టికర్తయొక్క మాయ అనిగాని, సైతానుయొక్క వాగురం అనిగాని నే నెన్నడూ భావించలేను దాన్ని ప్రేమిస్తూ, విశ్వసిస్తూండడమే నా అభిమతము. ఎక్కడోగల స్వర్గలోకంలోకి ఎగిరిపో ప్రయత్నించటం నేనుమాత్రం చేయలేను.

షె హూ
2-10-1891

గ్రామీణ ప్రాంతంలోకి రాగానే, మానవుణ్ణి మిగతా వాటికంటే భిన్నంగా చూడటం విరమించేను. నది రకరకాల యినప్రదేశాలగుండా ప్రవహిస్తూపోతూన్నట్లే, మానవప్రవాహంకూడా గలగల ధ్వనులు చేస్తూ అడవులు, పల్లెలు, పట్టణాలగుండా, మెలికలు మెలికలు తిరుగుతూ, పోతూంది. "మానవులు వస్తూ పోతూంటారు గాని నేనుమాత్రం నిరంతరం ప్రవహిస్తూనే ఉంటాను" అన్నది నిజంకాదు. మానవజాతి తన చిన్నవి, పెద్దవీ అయిన అనేక ప్రవాహాలతోకలసి, నదిమాదిరిగానే తన జన్మస్థానంతో ప్రారంభించి మరణ సముద్రంలో కలసే పర్యంతం ప్రవహిస్తూనే ఉంటుంది. ఈ జనన మరణాలు దానికి ఈ చివరా ఆ చివరా గల రెండు అగమ్య గోచరమైన అగాధాలు. ఈ రెండిటిమధ్యే అందరూ ఆడుతూ, పాడుతూ, మాటాడుతూ, పని పాటలు చేస్తూఉంటారు విధీ విరామం లేకుండా.

అల్లక్కడ పొలాల్లో రైతులు పాడుతున్నారు. ఇక్కడ బెస్తల చాపల డింగీలు నీళ్ళలో తిరుగాడుతున్నాయి. పొద్దెక్కుతూన్నకొద్దీ ఎండ వేడిమి ఎక్కువవుతోంది. కొంత మంది స్నానంచేస్తూ ఇంకా నదిలోనే ఉన్నారు. స్నానాలు ముగించుకొని కొందరు నీళ్ళబిందెలతో ఇళ్ళకువెళ్ళి పోతున్నారు. ఆ విధంగా జనప్రవాహం వందలాది సంవత్సరాల నుంచి ఆనది రెండుగట్లు దాటుతూ సందడిచేస్తూ పోతూంటే,

ఇక్కడ ఈ నది "ఎల్లప్పుడూ నేనుమాత్రం ప్రవహిస్తూవుం టాను" అన్న తన పాతపల్లవినిమాత్రం వదలకుండా ఉంది.

మిట్ట మధ్యాహ్నపు నిశ్శబ్దంమధ్య, ఎవడో పశుల కాపరి యువకుడు పెద్దగొంతుపెట్టి తన చెలికాణ్ణి తార స్థాయిలో పిలవడం వినబడుతూంది. ఏదో పడవఒకటి నీటిలో చప్పుడు చేసుకుంటూ ఇంటికి పోతూంది. ఎవరో ఓ పల్లెస్త్రీ ఉత్తకుండను నీటిలో ముంచబోతూండగా నదిలోని అలలు దానిని తపతప కొడుతున్నాయి. వీటిలో ఇంకా ఎన్నో అవ్య క్తాల్ప ధ్వనులుకూడా సమ్మిళితమవుతున్నాయి. పక్షుల కిల కిలా రావాలు, మధుపాల ఝుంకారాలు, ఇంటిపడవ అటూ ఇటూ కదులుతూ చేస్తూన్న ధ్వనులు, – అన్నీ కలపి బాధ పడుతూన్న బిడ్డను ఓదార్చటానికై తల్లిపాడే జోలపాటల్లా ఉన్నాయి. ఆమె "భయపడ కమ్మా" అంటూ పాడుతూ, వేడిగాఉన్న బిడ్డ నుదురు మెల్లగా మృదువుగా తడుతూ లాలన చేస్తుంది. "భయపడకు ఏడవకు ఇంక ఓక్షణం అన్నీ మరచిపోయి హాయిగా కాసేపు నిద్రపో" అంటూ ఓదారు స్తుంది.

ఆవాళ (కోజాగర్) కార్తీక పౌర్ణమి. నాలో నేను సంభాషించుకుంటూ, నదీతీరాన మెల్లగా పచారీచేస్తున్నాను. నిజానికి అది సంభాషణ అనటానికి వీల్లేదు. ఎంచేతనంటే ఎంతసేపూ నేనే మాట్లాడ్డం, నా ఊహాస్నేహితుడే వినడం జరుగుతూంది. పాపం, ఆ అమాయకుడికి మాట్లాడ్డానికి అవకా శమే లభించలేదు. అతనిని నిస్సహాయిణ్ణిచేసి, పిచ్చివానిలా జవాబులిస్తూండమని బలవంతంచేసేఅధికారంనాకేగదాఉంది!

ఆ పూర్ణిమారాత్రి ఎంతలా ఉంది! అటువంటి అందమైనరాత్రిలగురించి వ్రాద్దామని ఎన్నిసార్లు ప్రయత్నించి విఫలుడనయ్యేను! నదిమీద అలలన్నది ఒక్కటికూడా కనుపించలేదు. అక్కడనుంచి ఎంతోదూరంవరకు పిండార బోసినట్లు వెన్నెల కాస్తోంది. ఒక్కమనిషిగాని, ఒక్కపడవగాని ఎక్కడా కనబడలేదు. ఓ చెట్టుగాని, ఓ గడ్డిపోచగాని ఆ క్రొత్తలంకలోని సైకతతీరాన్ని దృగ్గోచరంకాలేదు. ఏకాకియైన చంద్రుడు పాడుబడ్డ పృథ్విమీద ఉదయిస్తూన్నట్లు, చైతన్యరహితమైన ఏకాంతంగుండా అకస్మాత్తుగా ఏదో నది ప్రవహిస్తూ తిరుగుతూన్నట్లు, ఎంతోసేపటినుంచి చెబుతూన్న గంధర్వాంగాన కథ హఠాత్తుగా నిర్మానుష్యమైన లోకంలో ముగించినట్లు, – అందులో రాజులు, రాకుమార్తెలు, సచివోత్తములు, మిత్రులు, హర్మ్య ప్రాసాదములు, కోటలూ పేటలూ సర్వాం మాయమయి, సప్తసముద్రాలు, త్రియోదశ నదులు, అపరిమితమైన చిత్తడి నేలలుమాత్రం మిగలగా వాటిమీద సాహసికులైన రాకుమారులు సంచరిస్తూన్నట్లు, ఆ వెన్నెట్లో తళుక్కుమని మెరుస్తున్నట్లుగా గోచరించేయి. మరణిస్తున్న లోకంయొక్క ఆఖరినాడిలా, నేను క్రిందకూ మీదకూ తిరుగుతున్నాను. నేనుతప్ప మిగతావారందరూ, నాకు ఎదురుగాఉన్న ఆ తీరాన్న-బ్రిటీషుప్రభుత్వం, పందొమ్మిదో శతాబ్దం, సిగరెట్లు, టీ, యథేచ్ఛగా పరిపాలించిన ఆ జీవిత తీరాన- అందరూ ఉన్నట్లు అగపడ్డారు.

షెలీదా
9-1-1892

కొన్నాళ్ళనుండి ఇచ్చటి వాతావరణం శీతాకాల, వసంతకాలంమధ్య ఊగిసలాడుతున్నది. ఉత్తరగాలి స్పర్శకు ఉదయాననే భూమిమీద జలాలమీద ఒణుకు ప్రాంభిస్తోంది. గాని సాయంకాలాన వెన్నెలగుండావచ్చి వీచే దక్షిణ పవనంతో పులకరింతలు కలుగుతున్నాయి.

వసంతం అప్పుడే బయలుదేరింది అనటానికి ఏమాత్రం సందేహంలేదు. ఎంతో కాలానికి తిరిగి కోకిల ఆవలిఒడ్డున ఉన్న తోపుల్లోంచి కూస్తోంది. మానవాళి హృదయంలో కూడా సంచనలం కలిగింది. చీకటి పడగానే గ్రామంలో పాటల సంరంభం ప్రారంభమయింది. తలుపులు కిటికీలు మూసుకుని, ముసుగుపెట్టి నిద్రపోవాలని ఏ ఒక్కరూ తొందర పడటంలేదు. గానా బజానాతో కాలం గడపాలని కుతూహల పడుతూన్నట్లు కనబడుతున్నారు.

ఈ రాత్రి పూర్ణిమా చంద్రుడు షోడశ కళలతో విరాజిల్లుతున్నాడు. నాకు ఎడమప్రక్కనున్న కిటికీలోంచి గుండ్రని నిండుముఖంతో అతను నాకేసి తొంగి చూసి, నే వ్రాసే ఉత్తరంలో అతన్నిగురించి ఏదయినా ఫిర్యాదు ఉందా అని అడుగుతూన్నట్లు గోచరించేడు. మానవులమైన మనం అతని అమృతకిరణాలకన్నా అతని కళంకాలనే బాగా గమనిస్తున్నామని అతను అనుమానించి ఉండొచ్చు!

ఇసుకఒడ్డున ఒకపక్షి తీ తీ అంటూ విషాదభరితంగా అరుస్తోంది. దానికి నది ఏమీ చలించినట్లు అగపడ

లేదు. అక్కడ పడవలు ఏమీ లేవు. గట్టుమీది చలనరహిత మైన తోపులు నీటిమీద నిశ్చలమైన నీడలను పరుస్తు న్నాయి. ఆకాశంలో క్రిమ్ముకున్న మబ్బుల్లోని చందుృడు నిద్రలో ఉన్నప్పుడు బలవంతాన తెరచిఉంచిన కనుగుడ్డులా కనబడుతున్నాడు.

సాయంకాలం అయేసరికి చీకట్లు మరీమరీ దట్టంకావ చ్చేయి. రేపు నేను ఆఫీసునుంచి వచ్చేసరికి నా ప్రవాస మిత్రుడయిన ఈ ప్రియమైన చంద్రుడు, నాకు కొంచెం దూరంగా జరిగిపోతాడు. గత సాయంత్రంలా తన హృద యాన్ని సంపూర్ణంగా బహిర్గతం చేయటం తెలివైనపని గాదేమో అని సంశయించి దాన్ని అతడు కొంచెం కొంచెం మూసుకుంటూ అలా దూరంగా ఉంటాడనుకుంటా.

క్రొత్త అయినటువంటివన్నీ, ఏకాంతమయినటువం టివన్నీ ప్రదేశాల్లో ప్రకృతి నిజమయిన స్నేహితు రాలుగా కలసి మెలసి ఉంటుంది. పూర్ణిమ వెళ్ళగానే చం ద్రుని వెన్నెల రోజురోజుకీ ఎక్కువఎక్కువగా నష్టపోతానన్న భావం నామనసులో మెదిలేసరికి నేను ఎంతో వ్యాకులత చెందేను. నేను నదీతీరానికి వస్తానని నిరీక్షిస్తూఉండే సౌంద ర్యం, ప్రశాంతం, ఇహ అక్కడ ఉండవని, నేను గాఢాంధ కారంలోనే తిరిగి ఇంటికి రావలసిఉంటుందని అనుకునేసరికి నా హృదయంలో ప్రవాసక్లేశం ఉద్ధృతం కాజొచ్చింది.

ఎలాగయితేనేం ఈ నాడు నిండు పూర్ణిమ అని, ఈ సంవత్సరంలో వసంతంయొక్క ప్రప్రథమ పూర్ణిమ అని- కాగితంమీద పెట్టగలిగేను. నది గట్టుమీద పిట్ట తీ తీ అనే

అరుపులు, ఆవలిఒడ్డునఉన్న పడవలోని మిణుకు మిణుకు మంటూన్న స్వల్ప కాంతి, తళతళా మెరుస్తూన్న నదీజలాలు, వాటిమీదపడే తీరవృక్షాల నల్ల నీడలు, నిర్లిప్తతో కాంతు లీనుతూన్న ధవళాకాశము, – వీటితో విరాజిల్లుతూన్న ఈ ఆనందప్రదమయిన రాత్రి భవిష్యత్తులో అదృష్టవశాత్తు ఎప్పుడయినా గుర్తుకు రావచ్చు!

షెలీదా
7–4–1892

నది లోతు తగ్గిపోతోంది. ఇక్కడ గుండెలోతుకన్న మించి లేనేలేదు. అందుచేత నది మధ్యల్లోనే పడవ లంగరు వేసి ఉంచేం అంటే ఏమంత విశేషంకాదు. నాకు కుడివైపున ఉన్న తీరాన్నగల భూములను రైతులు దున్నుకుంటున్నారు. ఆవులను నీళ్ళు త్రాగించటానికై అప్పటప్పట నదికి తీసుకు వస్తున్నారు. నాకు ఎడమవైపున పురాతన షెలీదా తోటల తాలూకు మామిడి, కొబ్బరి వృక్షాలు ఉన్నాయి, స్నానాల రేవులో పల్లెవనితలు కొందరు బట్టలు ఉతుక్కుంటున్నారు. కొందరు నీళ్ళబిందెలు నింపుకుంటున్నారు. కొందరు స్నానాలు చేస్తూ కిలకిలా నవ్వుకుంటూ ఏవేవో విషయాలు మాండలిక భాషలో ముచ్చటించుకుంటున్నారు.

బాలికలుమాత్రం జలక్రీడలు పూర్తిచేసేటట్టు కనుపించలేదు. నిర్వ్యాపీగా, మహదానందంతో కలకల నవ్వుకుంటూన్న వాళ్ళనవ్వులు వినముచ్చటగా ఉన్నాయి. పురుషులు గంభీరంగావచ్చి, నియమప్రకారం కొన్నిసార్లు నీటిలో మునిగి మారుమాటాడకుండా వెళ్ళిపోతున్నారు. ఆడపిల్లలుమాత్రం అటువంటి నియమాలు ఏవీ పెట్టుకోక నీటిని

వదలకుండా అతిస్నేహంతో ఆడుకుంటున్నారు. ఆ నదీ జలాలు, ఆ కన్నెలు ఒకేవిధంగా సరళంగా, స్వాభావికమైన పద్ధతిలో, ముద్దుముద్దుగా మాటా మంతీ ఆడుకుంటూ, పరుగెత్తుతూ, తుళ్ళింతలాడుతూ తళుక్కుమని మెరుస్తున్నారు. కాలుస్తూన్న ఎండవేడికి నదీజలాలు, ఆ పిల్లలు ఒకేవిధంగా అలసటచెంది చెన్ను తరుగుతున్నారు. ఇద్దరూ దెబ్బలు తిన గలరుగాని వాటికి చిదిగిపోరు. ఆ పిల్లలే లేకపోతే ఈ కఠిన ప్రపంచం నిస్సారమైఉండేది. వాళ్ళ మృదుమధుర కౌగిలింతలలోని నిగూఢ రహస్యపు లోతులను చూడలేకపోయి ఉండేది.

టెన్నీసన్ కవీశ్వరుడు నీరు మధిరకువలె నారి నరునకు అన్నాడు. ఈ నాడు 'నీరు మధిరకు' అనడానికి బదులు "నీరు నేలకు" అనడం సమంజసంగా ఉంటుందని నాకు అనిపిస్తోంది. నారీజనానికి నీళ్ళు అంటేఎంతో ప్రీతి. అక్కడ అనుమరికలు లేక స్వేచ్ఛగా ఉంటారు. వాటిలో హాయిగా స్నానం చేస్తారు. చక్కగా ఆడుకుంటారు. చెలమనుండి, బావినుండి, నదినుండి, పడియనుండీ నీరు మోసుకువెళ్ళటం ఇతరులకు చెప్పక తామే స్వంతంగానే చేసుకుంటారు.

బోల్‌పూర్
2–5–1894

ప్రపంచంలో అసంగతాలు ఎన్నోఉన్నాయి. ఎక్కడయితే ప్రకృతిసీమ బ్రహ్మాండంగాను, ఆకాశం అపరిమితంగాను, మబ్బులు దట్టంగానూ, అనుభూతులు అగాధంగానూ ఉం

టూయో, అంటే ఎక్కడయితే అనంతత్వం సాక్షాత్కరి స్తుందో - అటువంటి అనంత ప్రకృతికి యుక్త సహవాసి ఏకాకియైన మానవుడొక్కడే జనబాహుళ్యం ఉంటాడు! అటువంటి ప్రదేశాల్లో ఎంతో అల్పంగాను ప్రశాంత భంగ కారిగానూ అగపడుతుంది.

ఒకే మానవుడు, అనంతప్రకృతి అయితే సమాన హోదాతో,, ఘనతతో ఉంటారు. ఎవరిగద్దెలమీంచి వాళ్ళు ఒకరినొకరు చూచుకుంటూ, సమాన యోగ్యతలతో విల సిల్లుతూ ఉంటారు. గాని అక్కడే జనబాహుళ్యం ఎక్కువ యితే, ఆ అనంతప్రకృతి, ఆ మానవజాతి ఎంతో అల్పత్వం పొందుతాయి. ఆ ఘనత తరిగిపోతుంది. ఒకరితో ఒకరు సరి పెట్టుకోటానికి పోట్లాడుకుంటారు. ప్రతివ్యక్తీ తన పెరుగు దలకు ఎంతోకొంత స్థలాన్ని ఆపేక్షిస్తాడు. జనబాహు ళ్యంలో ఖాళీస్థలం లభించాలంటే వేచిఉండడం అవసరం. ఒకేచోట అందరంకలసి ఉందామనుకుని చేసే ప్రయత్నాలు సఫలం అవవు. మన అందరిచేతులు కలసినా, బాహువులు చాలినా ఈ అపార అగాధ విస్తీర్ణాన్ని లోబరచుకోలేము.

బోల్ పూర్

8–5–1892

హాస్యంగా మాటాడాలని ప్రయత్నించి ఉత్త వాగుడు కాయలుగా మాత్రం తయారయిన స్త్రీలు సహించవీలుగాని వారు. హాస్య చతురలుగా ఉండాలని వారు చేసే ప్రయ త్నాలు, సఫలం అయినా కాకపోయినా, గౌరవప్రదమైనవి మాత్రం కావు. హాస్యం, వికారాలతోనో, ఉన్నతశిఖరాలకు

ఎత్తే అతిశయోక్తులతోనూ కూడుకున్నది. అందుచేత అది ఒకవిధంగా ఔన్నత్యానికి సంబంధించినదనాలి. అలాంటప్పుడు. ఉన్నతమైన ఏనుగు, ఒంటె, జిరాఫీకూడా హాస్యమే అనాలి అపరిమితమైన బలుపు అంతాకూడా హాస్యమే అన్నమాట.

ముల్లుపూవుకువలె తీక్షణత్వం సౌందర్యానికి రక్తసంబంధి. అందుచేతనే ఎత్తిపొడవటం అనేది స్త్రీలకు సహజమే. లలితాంగులనోటంట వచ్చినప్పటికీ అది బాధించక మానదు. ఎగతాళీ పరిమాణంలో అధికంకాబట్టి దానిని స్త్రీలు మగధీరులకు విడచిపెట్టడం ఉత్తమం. పురుష ఫాల్ స్టాఫ్ హాస్యం మనపొట్టలు చెక్కలుచేస్తుంది. గాని స్త్రీ ఫాల్ స్టాఫ్ మన నరాలను నులిమి మరీ విడచిపెడుతుంది.

బోల్ పూర్
12–5–1892

సాయం సమయాల్లో డాబామీద ఒంటరిగా పచారీ చేయటం నాకు అలవాటు. నన్ను చూడవచ్చినవారికి అచ్చటి ప్రకృతిదృశ్యాల సౌందర్యాన్ని చూపించడం నా విధి అనుకున్నాను నిన్న మధ్యాహ్నం. అఘోర్‌ని మార్గదర్శకునిగా వెంటబెట్టుకొని వాళ్ళందరితో తిరగటం ప్రారంభించేను.

దిజ్మండల సమీపాన, దూరానగల చెట్లు నీలి శిఖరాలమీద సన్నని, గాఢ నీలిమేఘ రేఖ ఒకటి విరిసి చూడ ముచ్చట గొల్పుతూంది. దానిని నేను కవిత్వంపాలులో వర్ణించ ప్రయత్నంచేశాను. అందమైన నీలికళ్ళను మరీ అందంగా కనబరచే, కనురెప్పల అంచులనున్న కాటుకలా ఉంది అది అన్నాను. నా సహచరులలో ఒకడు నేను ఏమన్నదీ

వినేలేదు. మరొకడు విన్నా అర్థం చేసుకోలేకపోయేడు. మూడోవ్యక్తిమాత్రం "అవును, చాలా అందంగా ఉంది" అంటూ తేలిగ్గా తోసిపారేసాడు. రెండోసారి కవిత్వంలో చెప్పటానికి ఉత్సాహం నాకేమాత్రం కలుగలేదు.

సుమారు ఒకమైలు నడచేక, మేమందరం ఒక ఆన కట్టదగ్గరకు వచ్చేం. జలాశయంపొడుగునా తాటిచెట్లు బారు తీర్చి ఉన్నాయి. వాటిక్రింద ప్రకృతిసిద్ధమైన నీటిబుగ్గ ఒకటి ఉన్నది. అక్కడ నిలబడి దానివంక మేమందరం చూస్తూండగా ఉత్తరాన కనబడ్డ మేఘపంక్తి, బాగా పెరిగి పెద్దదై, కారునలుపెక్కి, మెరుపులతో మాకేసి పరుగులు పెడుతూ వస్తోంది.

ప్రకృతిసౌందర్యాన్ని తిలకించటం అనేపని ఇంట్లో కూచునే పదిలంగా చేయవచ్చునని మేమందరం ఏకైకనిర్ణయానికి వచ్చేం. గృహోన్ముఖులం అయ్యేమో లేదో, బ్రహ్మాండమైన గాలివాన చిత్తడి నేలమీాంచి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ, ఆగ్రహంతో పెడబొబ్బలుపెట్టుకుంటూ, మీాదికి వచ్చేసింది. అందాలప్రకృతిపడుచు, కనురెప్పలనున్న కాటుకను పొగడుతూన్నప్పుడు, కోపిష్టి ఇల్లాలులాకొట్టడానికి మీాదకు పరుగెత్తుకువస్తుందన్నభావమే నాకు కలగలేదు.

క్షణంలో ధూళీదుమ్ముతో అంతా గాఢాంధకారం అయిపోయింది. ముందు ఏమున్నదీకూడా కనుపించలేదు. గాలివాన బాగా విజృంభించింది. నేలమీాంచి చిన్నచిన్నరాళ్లు రివ్వున ఎగిరివచ్చి గుళ్ళలా మాకు తగులుతున్నాయి. గాలి

జోరుగా వీస్తూ మామెడలు పట్టుకొని ముందుకు తోస్తూంది. వర్షపుజల్లు కొరడాదెబ్బల్లా కొడుతున్నాయి.

పరుగెత్తండి పరుగెత్తండి అంటున్నారు కొందరు. గాని ఎలా ? నేల చదునుగాలేదు. ఎత్తుపల్లాలతో నిండిఉంది. మధ్యమధ్య చిన్నచిన్న నీటిగుంటలు ఉన్నాయి. మామూలు సమయాల్లోఅయినా వాటిని దాటడం కష్టం. ఇహ గాలి వానలో చెప్పాలా! నేను వెళ్ళి ముళ్ళపొదలో చిక్కుకున్నాను. అందులోంచి బయటపడటానికి గాలి జోరుగా వీచి ముందుకు నెట్టింది. ఆదెబ్బకు నేలమీద బోర్లాపడి ముఖం చిదిగిపోయేంత పనయింది.

మేం ఇళ్ళ దరిదాపులకు వచ్చేసరికి, నౌకర్ల దండు ఒకటి పరుగెత్తుకుంటూ, చప్పట్లుకొడుతూ, కేకలు పెడుతూ చేతులు త్రిప్పుకుంటూ మాకేసి వచ్చేరు. వాళ్ళందరూ మరో గాలివానలా మామీద పడ్డారు. కొందరు మాచేతులు పట్టుకున్నారు. కొందరు మా అవస్థకు దుఃఖించేరు. కొందరు మాకు దారి చూపెంచటానికి ఆతృత పడుతున్నారు. గాలివాన మమ్మల్ని ఎగరేసుకుపోతుందేమోనన్న భయంచేత కొందరు మావెనుక నుంచుని మమ్మల్ని కాపాడుతూన్నట్లు కనపడ్డారు. వాళ్ళు మాపై చూపుతూన్న శ్రద్ధాసక్తుల బారినుండి తప్పించుకునేందుకు కొంత శ్రమ పడవలసివచ్చింది. మేం ఇంట్లో ప్రవేశించేసరికి అలసిపోయేం. గుడ్డలుతడిసిపోయేయి. మట్టితో నిండిపోయేయి. జుత్తంతా పీకేసినట్లయి

నేనుమాత్రం ఒకటి నేర్చుకొ[illegible] ఇటు పైని వ్రాసే ఏ నవలలోగాని, క[illegible]

తన ప్రేయసిచిత్రాన్ని మనస్సులో ఉంచుకొని గాలివానలో నిశ్చలంగా నిశ్చింతగా నడచిపోగలడుఅన్నఅబద్ధాన్నిమాత్రం వ్రాయకూడదని ఒక నిశ్చయానికి వచ్చేను అటువంటి ఉద్ధృతమైన గాలివానలో ఎవ్వడయినాసరే ప్రియురాలి ముఖాన్ని, — అది ఎంత అందమయినది అయినాసరే — మనస్సులో ఉంచుకోలేడు. తనకళ్ళల్లో ఇసికపడకుండా చూచుకోవడమే ఆ గాలివానలో కష్టం అయిపోతుంది! ఇహ ప్రేయసి ముఖాన్ని ఏం చూడగలడు!

భయంకర నిశీథిలో, గాలివానలో కృష్ణుని కలుసుకునేందుకు రహస్యస్థలానికి వెళుతూన్న రాధను అతి మనోహరంగా, హృదయంగమంగా కీర్తించేరు వైష్ణవకవులు. కృష్ణుని చేరుకొనేసరికి ఆమె ఏస్థితిలోఉందో వాళ్ళు ఎవ్వరైనా ఎప్పుడైనా ఓ క్షణం ఆగి ఆలోచించారా? అని అనిపిస్తూంటుంది నాకు. ఆమెజుట్టు ఎంతగా చెదరి, చిక్కుపడిఉంటుందో మనం సులువుగా ఊహించగలం. ఆమె అలంకరణస్థితికూడా అదే విధంగా ఊహించగలం. ఆమె పూపొదరింటికి కృష్ణసమాగమంకోసం వచ్చేసరికి ఆమె ఒడలంతా తడిసి బురదపూతతో నిండిఉంది. నిజంగా ఆమెను ఆ సమయంలో చూడాల్సిందే! గాని, ఈ వైష్ణవకవుల గీతాలను మనం చదివినప్పుడు మనకు ఈ భావాలు కలగవు. మనమనోఫలకముపై, భువనమోహనమైన ఒక యువ [illegible] చిత్రం గోచరిస్తూంది. శ్రావణమాస గాఢ నిశీథిలో, [illegible]లో, పుష్పిస్తూన్న కదంబవృక్షాల రక్షణలో [illegible]కి, గాలిని, వర్షాన్ని సర్వాన్ని మరచి, [illegible]డి, లోకోత్కృష్టమైన ప్రేమాతి

శయంతో కృష్ణునిదగ్గరకు వెళుతూన్న ఆ రాధచిత్రించక్కటే మనం చూడగలుగుతాం. చప్పుడు అవుతుందన్న భయం చేత ఆమె తన గాజులను కట్టివేసింది. ఎవడయినా గుర్తిస్తా రన్న భయంచేత, నీలిమేఘంలాంటి చీరను కట్టుకుంది. గాని ఆమె ఏగొడుగూ వేసుకోలేదు. వేసుకుంటే తడసిపోతుంది! ఆమె ఏదివ్వే తీసుకువెళ్ళలేదు. తీసుకువెళ్ళితే పడిపోతుంది!

వాస్తవికజీవితంలో ఎంతో అవుసరమయిన వస్తువు లన్నీ కావ్యజగత్తులో ఎంత ఉపేక్షింపబడ్డాయి! గాని ఆ వస్తు వుల బంధనాలనుంచి మనలను విముక్తులనుచేద్దామని కవిత వ్యర్థప్రయత్నాలను చేస్తూన్నప్పటికి అవి మనలను అంటిపెట్టు కునే ఉంటాయి. నాగరికతా పురోగమనంతో నిష్క్రమిం చేది కవితే అని, చెప్పులు, గొడుగులూ నమూనాలు అభి వృద్ధి చేయడానికై మాత్రం ప్రయత్నాలు వదలకుండా జరుగు తూంటాయి అని అంటున్నారు.

బోల్‌పూర్
16–5–1892

ఇక్కడ ఏ చర్చిగంటా మోగదు. సమీపాన మరో మానవనివాసమయినా లేకపోవడంచేత పక్షులు పాటలు ఆపి వేయడంతోనే, సంధ్యాకాలాన సంపూర్ణ నిశ్శబ్దం రాజ్య మేలుతూంటుంది ఇక్కడ. మొదటిఝామునకు, అర్ధరాత్రికి ఏమంత తేడా కనబడదు. కలకత్తానగరంలో నిద్రపట్టనిరాత్రి, మందగమనం కలిగిన చీకటి మహానదిలా నడుస్తుంది. దాని గమనంలోని వివిధధ్వనులు వెల్లకిలా పరుండి ఎవరయినా లెక్కించగలరు. గాని ఇచ్చటిరాత్రి సువిశాలమైన నిశ్చల సర

స్సులా ప్రశాంతంగా నిద్రిస్తూంటుంది. కదులుతూన్నట్లు ఏ విధమైన చిహ్నాలు కనబడవు. గతరాత్రి ప్రక్కమీద అటూ ఇటూ దొర్లుతూండగా, స్థంబించిన వాతావరణంలో చుట్టి వేయబడ్డట్లు అనిపించింది నాకు. ఈ ఉదయాన నేను పక్క మీంచి లేచేసరికి మామూలుకన్నా కొంచెం ఆలస్యం అయింది. మేడ క్రిందిగదిలోకి వచ్చి, బాలీసుకు చేరగిలి, కాలిమీద కాలేసుకున్నాను. గుండెమీద పలక ఉంచుకొని ప్రాతఃకాల పవనాలు వీస్తూండగా, పక్షుల కిలకిలా రావాలు చేస్తూండగా ఒకపద్యం వ్రాయ ప్రారంభించేను. వ్రాత బ్రహ్మాండంగా సాగిపోతోంది. నా పెదాలపై చిరునవ్వు చిందులాడుతోంది. ఆనంద పారవశ్యంతో నేత్రాలు అర్ధ నిమీలితాలయ్యాయి. శిరస్సు లయానుగుణ్యంగా అటూ ఇటూ ఆడుతూన్నది పద్యం. పూర్తవటానికి సిద్ధంగాఉండగా పోస్టు వచ్చింది.

ఆ పోస్టులో ఒకఉత్తరం, సాధన పత్రికతాలూకు ఆఖరిసంచిక, ఒక మోనిస్టుసంచిక, దిద్దవలసిన కాగితాలు కొన్నీ ఉన్నాయి. ఉత్తరాన్ని చదివేసి, కోయకుండాఉన్న సాధనపత్రికలోని పేజీలను చకచకా త్రిప్పేసి, తిరిగి గొణు క్కుంటూ, తల ఆడిస్తూ పద్యరచనలో నిమగ్నుడ నయ్యేను.

పేజీలు పేజీలు వ్రాసినా గద్యరచన, ఒక్కపద్యం వ్రాసినందువల్ల వచ్చే ఆనందాన్నికూడా ఎందుకు ఈయలేక పోతూన్నదని నాకు ఆశ్చర్యం కలుగుతూంటుంది. వ్యక్తుల ఉద్వేగాలు, పద్యంలో అయితే పరిపూర్ణ ఆకృతి పొందు తాయి. వాటిని ఉన్నపాళంగా చేత్తో తీసుకునేటట్లుగా ఉం

టాయి. కాని గద్యంమాత్రం, విడివిడిగా ఉన్న వస్తువులతో నిండిన గోతాంలాంటిది. మహా భారంగావుండి, కదల్చటానికి గాని, ఎలాకావలిస్తే అలా ఎత్తటానికిగాని సాధ్యము కానిది.

నేను రోజుకు ఒకపద్యంచొప్పున వ్రాయగలిగితే నా జీవితం మహదానందంతో గడిచిపోతుంది. పద్యరచన చాలా సంవత్సరాలనుండి చేస్తున్నా, అది నాకు ఈ నాటికికూడా పూర్తిగా స్వాధీనంకాలేదు. నాకు మనసుపుట్టినప్పుడెల్లా స్వారీ చేయడానికి, అంగీకరించే రెక్కలగుఱ్ఱం వంటిదికాదు అది! భావాలుకోరిన ఉన్నతోన్నత ప్రదేశాలకు నిరాటంకంగా పరుగులు తీయడానికి గల స్వేచ్ఛలోనే ఉంది కళ యొక్క ఆనందం. ఆ సంచారానంతరం తిరిగి యీ స్వేచ్ఛారహిత ప్రపంచంలోకి వచ్చినా, ఆ ఆనందంతాలూకు ప్రతిధ్వని చెవిలో ఉండిపోతుంది. మనస్సు మహోల్లాసంతో నిండి ఉంటుంది.

చిన్న చిన్న పద్యాలు కొంకపోయినా నా దగ్గరకు వస్తూనేవున్నాయి. అవి అలా రావడంతో నా నాటకరచనా వ్యాసంగానికి ఆటంకం కలుగుతూన్నది. ఇవేగాని రాకుండా వున్నట్లయితే, వాతలుపు తడుతూన్న రెండుమూడు నాటకాల తాలూకు భావాలను లోనికి ప్రవేశపెట్టి వుండేవాణ్ణి. శీతల వాతావరణం వచ్చేవరకు నేను వేచి వుండవలసి వస్తుందేమోనని భయపడుతున్నాను. నా నాటకాలన్నీ, రెక్క చిత్ర తప్ప, - శీతాకాలంలోనే వ్రాయబడ్డాయి. ఆ ఋతు

వులో కవితావేశం చల్లబడిపోతుంది. నాటకాలు వ్రాయటా నికి విశ్రాంతి లభిస్తుంది.

బోల్ పూర్
31—5—1892

ఇంకా అయిదు కానేలేదు. అప్పుడే వెలుతురు వచ్చేసింది. ప్రత్యూష పవనాంకురాలు వీస్తూ ఆహ్లాదం కలుగ చేస్తున్నాయి. తోటలో పక్షులన్నీ మేల్కొని కిలకిలారావాలు చేస్తున్నాయి. కోయిలమాత్రం ఒంటరిగా కూస్తోంది. విసుగు విరామం లేకుండా అది అలా ఎందుకు కూస్తున్నదో అర్థం చేసుకోవడం చాలా కష్టం. మనలను వినోదపరచటానికి మాత్రం కాదని సుస్పష్టం అవుతూంది. విరహబాధతో తపిస్తూన్న వారికి ఊరట కలుగచేయటానికీగాదు. ఆ కూయడంలో దానికేదో స్వంతలాభం ఉండితీరాలి. గాని, పాపం! ఆ లాభంమాత్రం ఎప్పటికీ సమకూరినట్లు లేదు. అయినప్పటికి అది నిస్పృహ చెందలేదు. గుండెబేజారు చేసుకోలేదు. కూ! కూ! అంటూ కూస్తూనేవుంది. ఉండుండి కాకలీస్వరంలో మనోహరంగా అనుస్తోంది. దాని అర్థం ఏమిటయి ఉంటుంది?

దూరాన మరేదోపక్షి, ఆశలన్నీ అణగారిపోయినట్లుగా, శక్తిహీనంగా, నిరుత్సాహంగా "కక్, కక్" అని అనుస్తోంది. అది ఎలా వున్నప్పటికీ విషాదభరితమైన ఈ కక్ కక్ కక్ అనే అనుపునుమాత్రం ఆపలేకపోతోంది.

మెత్తని గుండెలు, మెడలు, పలురంగుల ఈకలు గల ఈ అమాయకపు పక్షిసంతతుల ఆంతరంగిక విషయాలు నిజా

నికి మనకు ఏమాత్రం తెలియవుకదా! విరామం అన్నది లేకుండా ఈ పృథ్విలో పాడుతూండాలని అవి ఎందుకు అనుకుంటున్నాయ్?

షెలీదా
31—6—1892

మహా వినయుక్తమైన ఈ రకం మర్యాదలను నేను గర్హిస్తాను. "నేను అరబ్బీ బెడూఇన్ అవుతే చాలా బాగుంటుంది" అని యీమధ్య రోజూ పునశ్చరణ చేస్తున్నాను. ఆ అనాగరికత ఆరోగ్యమైంది దృఢమైంది. పసందయినది, స్వేచ్ఛతో విలసిల్లుతూన్నది.

మనోశరీరాలు అర్థరహితమైన కట్టుబాట్లనుంచి విముక్తి పొందాలని- స్వేచ్ఛా జీవితంయొక్క ఆనందాన్ని అనుభవించాలను, మంచివయినాసరే చెడువయినాసరే, విశాలమైనటువంటిన్నీ, శంకా రహితమైనటువంటిన్నీ నిరాటంకమయినటువంటిన్నీ భావాలు, ఆశయాలు కలిగివుండాలనీ - ఆచారానికి, వివేకానికి కోరికకు, కోరికకు చేతకు జరుగుతూన్న నిరంతర సంఘర్షణనుండి స్వేచ్ఛ పొందాలని నేను కాంక్షిస్తున్నాను.

కుంటువడ్డ ఈ నా జీవితానికి సంపూర్ణ స్వేచ్ఛ ప్రసాదించుకోగలిగితే, సరిహద్దులన్నవి నిర్మూలించగలిగితే, ప్రపంచాన్ని అంతా అలజడితో నింపివేస్తాను. పెంకె అశ్వంలా, నా ఆనందపు వేగంతో రివ్వురివ్వున పిచ్చిగా పరుగులు పెడతాను! ఇంతకూ నేను వంగీయుణ్ణేగాని అరబ్బీని కాదు! ఓ మూలమూల అదేపనిగా కూచుండిపోవటం, బద్ధకంగా ఉండటం, చిరాకుపడటం, ఏదో వాదిస్తూండటంమాత్రమే చేస్తు

న్నాను. మనస్సును అటూఇటూ చేసను వేయిస్తున్నట్లుగా త్రిప్పుతున్నాను. ఆ సమయంలో మరుగుతూన్న నూనె ఒక సారి ఇటూ, మరోసారి అటూ చుంయ్ చుంయ్ మంటుంది.

ఇలాగే జరగనీ! నేను పూర్తిగా ఆటవికుణ్ని అవలేను. కాబట్టి పూర్తిగా నాగరికుణ్ని అవటానికయినా ప్రయత్నించటం సమంజసం. అయినా నాగరితకు అనాగరితకు మధ్య జగడం పెట్టడం ఎందుకు లెండి!

షెలీదా

16—6—1892

నదిమీదగాని, గ్రామీణప్రాంతంలోగాని ఒంటరిగా ఎక్కువకాలం నివసించినట్లయితే, ఒక విషయం సుస్పష్టం అవుతుంది దైనందిన జీవితానికి సంబంధించిన సామాన్యవిధులను సరళంగానూ, స్వాభావికంగానూ, నిరాడంబరంగానూ నిర్వర్తించడంకన్న సుందరమైందిగాని ఘనమైందిగాని మరొకటి లేదని తేటతెల్లమవుతుంది. పృథ్వీమీదున్న తృణాలు మొదలుకొని ఆకాశంలోవున్న నక్షత్రాలవరకూ ప్రతిదీ సరిగ్గా ఈ విద్యుక్తధర్మాన్నే నిర్వహిస్తూన్నది. ప్రకృతిలో అఖండమైన శాంతి, సాటిలేని సౌందర్యం వెల్లివిరుస్తున్నాయంటే కారణం వేటి సరిహద్దుల్లో అవి సంచరిస్తూ దురాక్రమణకు ప్రయత్నించకపోవడమే - ప్రకృతిలో ప్రతిఒక్కటీ చేస్తూన్నపని క్షణంలో జరిగిపోయేది మాత్రంకాదు. గడ్డి తనయావచ్ఛక్తినీ వినియోగిస్తేనేగాని అట్టడుగున ఉన్న వేళ్ళ చివరలనుంచి తన జీవనాధారాన్ని గ్రహించలేదు. ఇదంతా ఎందుకంటే అక్కడక్కడే, గడ్డిగా, తన శాహతకు సరిపడ్డట్టుగా పెరగ

టానికిమాత్రమే. అది మహా వటవృక్షంగా పెరిగిపోదామని ఎన్నడూ వ్యర్థప్రయత్నం చేయదు. ఆవిధంగా ఆ గడ్డి ఉండడంచేతనే, భూమికి అందమైన పచ్చటి రత్నకంబళం అమరింది. మానవసంఘాల్లో శాంతి సౌందర్యాలు ఏ స్వల్పంగానయినా ఉన్నాయంటే కారణం చిన్నచిన్న విధులను సక్రమంగా ప్రతినిత్యం నిర్వర్తించడంవలనేగాని, పెద్దపనులవలననూ, బ్రహ్మాండంగా మాట్లాడ్డంవలననూ మాత్రం కాదు.

ప్రతీ క్షణమందు మన యావజ్జీవితం సుస్పష్టంగా వ్యక్తం కానందువలననే కామోలు, ఏదో ఒక ఆశ ప్రలోభపెడుతూ లాక్కెళుతూంటుంది. బాధ్యతలతో సతమతంకు కాని ఉజ్జ్వల భవిష్యజ్జీవిత చిత్రం మనలను ఆకర్షిస్తూంటుంది గాని ఇవన్నీ కేవలం భ్రమతే!

షెలీదా

2—6—1892

నిన్ననే ఆషాఢమాస ప్రథమదివసం. వర్షఋతువుకు పట్టాభిషేకమహోత్సవం అతి వైభవంగా, కన్నుల పండువుగా జరిగింది. దినమంతా చాలా వేడిగావుంది. గాని మధ్యాహ్నం అయేసరికి కారుమేఘాలు బ్రహ్మాండంగా ఆకాశంలో గుమిగూడేయి.

ఈవర్షాకాల తొలిరోజున, ఏచీకటిగదిలోనో కూచోడం కన్నా, బయటకు వెళ్ళి తడిస్తేనే బాగుంటుంది అని అనుకున్నాను నాలో నేను.

నా జీవితంలో 1892 సంవత్సరం మళ్ళా రాదు. ఈ ఆషాఢమాస ప్రథమదినాలుమాత్రం ఇంకా ఎన్నివస్తాయి ?

మేఘసందేశ కావ్యకర్త అయిన కాళిదాసమహాకవిచే అతి ఉత్కృష్టంగా కీర్తింపబడ్డ ఈ ఆషాఢ ప్రథమదినాలు ఓ ముప్పదింటిని నేను చూడగలిగితే, దీర్ఘాయుష్కుడనయినట్లు గానే భావిస్తాను.

ప్రతి ఒక్కరోజూ, ఉదయాస్తమయ సూర్యులతో అరుణారుణంగాగాని, పండువెన్నెల్లో పరిమళించే ధవళ కుసుమంలా గాని, నా జీవితంలో అడుగిడుతూన్నదంటే నేను ఎంతో అదృష్టశాలిని. నిజంగా నా భాగ్యం ఎంతని చెప్పడం!

వేయి సంవత్సరాలక్రితం కాళీదాస మహాకవి ప్రప్రథమంగా ఆ ఆషాఢప్రథమ దివసానికి స్వాగతం ఇచ్చేడు. ఏ దినమయితే పురాతన ఉజ్జయినీ కవీశ్వరునిచేత పొగడబడిందో, ఏ దినమయితే అసంఖ్యాకులైన స్త్రీ పురుషులకు కలయికల ఆనందాన్ని, ఎడబాట్ల దుఃఖాన్ని తీసుకువచ్చిందో, సరిగ్గా ఆ ఆషాఢ ప్రథమదినమే సమస్త వైభవోపేతంగా ప్రతి సంవత్సరం ఒకతూరి నా జీవితంలోకి అడుగిడుతూంటుంది.

కాలప్రభలతో వెలిగిపోతున్న అటువంటి మహోత్కృష్టమైన దినం ప్రతి సంవత్సరం ఒక్కొక్కటే నా జీవితం నుంచి జారిపోతోంది. కాళిదాసు మహాకవిచే కీర్తింపబడ్డ ఈ దినం, మేఘదూత తాలూకు ఈ దినం, హిందూస్థాన్‌లో వర్షాలకు శాశ్వతమైన ఈ ప్రారంభదినం తిరిగి నాకు లభించని ఒకానొక సమయం వస్తుంది. దాన్ని గుర్తించేక ప్రకృతిని కనులారా చూడాలనీ, ప్రతి సూర్యోదయానికి మనస్ఫూర్తిగా స్వాగతం సమర్పించాలనీ, అస్తమిత సూర్యునికి ప్రతిరోజూ చెలికానివలె వీడ్కోలు చెప్పాలనీ అభిలషిస్తున్నాను.

ఎంత బ్రహ్మాండమయిన పండుగ! ఎంత విశాలమైన వేడుకల రంగస్థలం! ఆ పండగల్లో పూర్తి భాగస్వాములం అయి ఆ ఆనందాన్ని సంపూర్తిగా పొందలేకపోతున్నాం. అంటే కారణం ఆ ఆనందలోకానికి మనం సుదూరంగా ఉండిపోవడమే. నక్షత్రాలకాంతి భూమిని చేరడానికి లక్షలకొలదీ మైళ్ళు ప్రయాణం చేస్తుంది. కాని అది మన హృదయాలను మాత్రం చేరలేకపోతోంది. అంటే ఇంకా లక్షలకు లక్షలు మైళ్ళదూరాన మనం వున్నామన్నమాట!

నేను నిర్మించిన ఈ లోకం చిత్రవిచిత్ర వ్యక్తులతో నిండివుంది. వారంతా తమచుట్టూ గోడలనూ, సమూహాలను నిర్మించుకోవడంలోనే నిరంతరం నిమగ్నులయి వున్నారు. తమ చుట్టూ తెరలు వేసుకుని వారు ఎంతో జాగరూకులై వున్నారు. లేకపోతే చూడ్డం జరుగుతుందిట! ఇటువంటివాళ్లు పూలమొక్కలకు చంద్రదర్శనం కాకుండా వుండడానికై చుట్టూ మడిసంచీలు తొడిగి, మీద చాందినీలు కట్టడం మానేసేరు ఏమని ఆశ్చర్యపడుతూంటాను.

నడుస్తూన్న ఈ జన్మలోని కోరికల ననుసరించి భవిష్యజ్జన్మ నిర్ణయింపబడడమే నిజమయితే, వృక్ష తెరలమధ్యగల ఈగోళంనుంచి నేను విముక్తిపొంది స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో విలసిల్లుతూన్న ఏ ఆనందసీమల్లోనో ఉత్తరజన్మలో జన్మించి తీరాలి.

సౌందర్యాన్ని అనుభవించ శక్తిలేని వ్యక్తులు దానిని ఇంద్రియ సంబంధమైన తుచ్ఛ విషయమని తృణీకరిస్తారు. గాని దాన్ని చవిచూచిన ధీరులుమాత్రం అది కేవలం

ఇంద్రియ సంబంధమైందికాదని, నక్షత్రాల సూక్ష్మశక్తులకు సయితం అశక్యమయిందని, హృదయంకూడా దాని కోరికను సఫలీకృతం చేయ అసమర్థమైందనీ తెలుసుకోగలుగుతారు.

తాజా కలం :- నేను ఏదయితే చెబుదామని ప్రారంభించేనో, అదే చెప్పలేదు. ఇప్పటికే ఎక్కువ చెప్పేనని భయపడకు. చెప్పవలసింది ఒక్క నాలుగు కాగితాలకు మించి ఉండదులే ! అదేమిటంటే ఆషాడమాసం ప్రవేశించగానే ఆ మొదటిరోజు సాయంత్రాన ఈ బెల్లాంటి పెద్దపెద్ద జల్లులతో కుంభవృష్టి కురియ ప్రారంభించింది. అంతే !

గోలుండాకు వెళ్ళేమార్గంలో
21-6-1892

సైకత తీరాలు, పంటలతో నిండిన కలకలలాడేపొలాలు, గ్రామసీమల చిత్రాలు అసంఖ్యాకంగా ఇరుప్రక్కలా దృగ్గోచరం అవుతున్నాయి. ఆకాశంలో తేలియాడుతూన్న మేఘాలు, అహస్సు నిశాకాంతను కలుసుకుంటూన్నప్పుడు విరిసిన వింతరంగులు నేత్రానందాన్ని సమకూరుస్తున్నాయి. పడవలు దొంగతనంగా వస్తున్నాయి. బెస్తలు చేపలను పట్టుకుంటున్నారు. ఉత్సాహంగావున్న ఆ పగలల్లా ఆ నదీ జలాలు గంగలమంటూ లాలిస్తూనే ఉన్నాయి. ఎంతో విస్తీర్ణతగల ఆ నదీజలాలు, సాయం నిశ్శబ్దతలో జోకొట్టి నిద్రపుచ్చబడిన పాపాయిలా ప్రశాంతంగా ఉంది. సీమారహితమైన ఆకాశంనుంచి నక్షత్రాలన్నీ ఆ నదిని భద్రంగా చూస్తూ కాపాడుతున్నాయి. ఇరువైపులా గాఢనిద్రలోఉన్న

గట్లత్రో, ఆరాత్రిసమయాల్లో నేను నిద్రపోకుండా కూచుని ఉంటాను. ఆ ప్రశాంత నిశా నిశ్శబ్దాన్ని భంగపరచేవల్లా- సమీప గ్రామకంతానగల అడవిలోంచి అరుస్తున్న నక్క- అరుపులు- వడిగా ప్రవహించే పద్మానది, పర్వతాల్లా ఉన్న గట్లను దొలుస్తూండగా దభేలుమని నీటిలో పడుతూన్న మట్టి పెళ్లల చప్పుళ్ళు మాత్రమే. పసిడి వర్ణనగల ఇసుకతీరం చెట్టూ చేమా లేకుండా ఎంతో దూరం విస్తరించి ఉంది. ఆ తీరానకనే ఖాళీపడవ ఒకటి కట్టబడిఉంది. ఆకాశవర్ణాన్ననుసరించి ఉన్నదన నీలి జలాలు వడివడిగా ప్రవహిస్తున్నాయి. ఈ దృశ్యం నన్నెంతో కదిలించింది. దానికి కారణం సరిగా చెప్పలేను. కాని ఒక దానినిమాత్రం అనుమానిస్తున్నాను. నాలుగ్గోడ మధ్యనలిగిన నా బాల్యంలో, ఏకాకిగా నాగదిలో కారాగారవాస శిక్ష అనుభవిస్తూ అరేబియను నైట్సు కథలు తదేక దీక్షగా చదవసాగేను. ఆ కథల్లోని సింద్బాద్ నావికు నితో కలసి చిత్రవిచిత్రమైన అనేక ప్రదేశాల్లో అతడుచేసిన అద్భుత సాహసకృత్యాల్లో నేనూ పాల్గొనేవాణ్ని. ఆనాటి ఆ పాత కోరికలు, కాంక్షలు నాలో ఇంకా నశించకుండా ఉండి ఇసుక తీరానికి కప్పబడ్డ ఏ ఖాళీపడవ కంటికి కనబడినాసరే విజృంభిస్తున్నాయి. నన్ను అతిగా కదలిస్తున్నాయి.

చిన్నతనంలో నేను ఏ దివ్యగాథలూ వినకుండా, అరేబియన్ నైట్సు, రాబిన్‌సన్ క్రూసో కథలు చదవకుండా ఉన్నట్లయితే నదీ దూరతీరాల దృశ్యాలుగాని, సువిశాలమైన పంటపొలాల దూరపుటంచులుగాని ఈ విధంగా అపరిమితంగా

కదిలింపగలిగేవి కావు. వాస్తవానికి ఈ ప్రపంచమంతా మరొక విధంగా నా మనస్సుకు గోచరించి ఉండేది.

మానవుని మస్తిష్కంలో ఊహా వాస్తవికతలు పద్మవ్యూహంలా ఎలా బ్రహ్మ చిక్కుగా పరిణమించేయి! చిన్నవి పెద్దవి అయిన కథలు, సంఘటనలు, చిత్రాలతో అవి ఎంత చక్కగా పొందికగా అల్లబడ్డాయి!

షెలీదా,
22—6—1892

ఈరోజు తెల్లవారుఝామునసే, పండగదినం కావటం చేత కామోలు, స్నానాల రేవులో స్త్రీలు సంతోషాతిశయంతో బిగ్గరగా "ఉలు! ఉలు! ఉలు!" అని అరుస్తున్నారు. పక్కమీంచు ఇంకా లేవని నాకు ఆ ధ్వనులు వినిపించేయి. అవి నన్ను విచిత్రంగా కదిలించేయి. ఎందుకంటే మాత్రం చెప్పలేను.

బహుశా అటువంటి సంతోషధ్వానాలు, లోకంలో జరిగే పండుగ సంరంభాన్ని గుర్తు చేయటంకోసమేనేమో అనిపిస్తోంది. ఆ పండుగల్లో చాలావాటితో ప్రతివ్యక్తికీ సంబంధం కూడా ఉండకపోవచ్చు. ప్రపంచం సువిశాలమయినది. మానవజాతి అసంఖ్యాకమయింది. అయినా వ్యక్తి పెట్టుకుంటూన్న సంబంధ బాంధవ్యాలు మాత్రం ఎంత తక్కువ మందితోను! దూరంనుండి వినబడుతూన్న జీవితంయొక్క ధ్వనులు మెల్లగా ప్రయాణం చేసుకుంటూ దగ్గరకువచ్చి, తెలియని గృహసీమలనుంచి తెచ్చిన వార్తలను అందిస్తాయి. మానవ లోకంలో అధికసంఖ్యాకులకు, తనను ఆత్మీయుడుగా స్వీకరిద్దా

మనిగాని లేక తెలుసుకుందామనిగాని ఉద్దేశ్యం ఉన్నట్లు ఎక్కడా కనబడదు ఆ వార్తలద్వారా. అది గ్రహించిన వెంటనే తనను అందరూ విడచిపెట్టినట్లు, ప్రపంచానికి అంటీ అంటనట్లుగా ఉంచబడినట్లున్నూ భావించి అపరిమితదుఃఖాన్ని అనుభవిస్తాడు.

* ఈ ఉలు! ఉలు! సంతోషధ్వానాలు నా జీవితాన్ని, గతాన్ని, భవిష్యత్తున్నూ—ఒక సుదీర్ఘమైన బాటగా రూపొందించి రెండుచివరల నుంచీ అవి పయనిస్తూ నాదగ్గరకు వస్తూన్నట్లుగా నాకు అగపడుతున్నాయి. ఈ భావనే ఈనాటి ప్రారంభానికి సౌందర్యాన్ని సమకూర్చింది.

ఇదెంతసేపు నిలబడుతుంది! సిబ్బందితోసహా మేనేజరు, కష్టసుఖాలు మనవిచేసుకునేందుకు రైతాంగం, రంగంమీదికి రావడంతోనే ఈ సుందర భూతభవిష్యజ్జీవితాల క్షణికదృశ్యం ఆవలకు నెట్టబడి, బలిష్టమైన వర్తమానం వందనంచేసి నా ముందు నుంచుంటుంది.

షాజెద్‌పూర్
25—6—1892

ఈరోజున వచ్చిన ఉత్తరాల్లో "వ" అనే గాయకుని గానం గురించి ప్రస్తావన జరిగింది. అది నా హృదయంలో చెప్పలేని కోరికలను రేకెత్తించసాగింది. జీవితం యొక్క స్వల్ప సంతోషాల్లో ప్రతిఒక్కటీ - నగరం యొక్క రణగొణ

---

*పెళ్ళిళ్ళలోనూ, పండగల్లోనూ, పర్వదినాల్లోనూ సంతోషంతో స్త్రీజనం నోటితో చేసేధ్వనులు.

ధ్వని మధ్యలో మెప్పును పొందలేక అణగిఉండిన అవన్నీ ఇంటికి బహు దూరాన ఉన్నప్పుడు హృదయానికి తమకు అందవలసిన వాటినిగురించి విజ్ఞప్తులు పంప్రకుంటాయి. నాకు సంగీతం అంటే మహాఇష్టం. కలకత్తానగరంలో గాయకులకు గాని, సంగీత వాయిద్యాలకుగాని కొరతన్నది లేనే లేదు అయినప్పటికీ అప్పుడు వాటన్నిటికీ నేను చెవిపెట్టేను. వాటి ప్రాశస్త్యం యుక్తసమయంలో గుర్తించలేక పోయి నప్పటికి, హృదయంలో వాటికోసం పిపాసమాత్రం అలా ఉండిపోయింది.

ఈరోజు ఉత్తరాలు చదువుతూండగా, "ఏ" గాయకుని తీయని పాట వినాలని గాఢవాంఛ కలిగింది. వెనువెంటనే నాకొకటిస్ఫురించింది. సృష్టిలో అనేకమైనకోరికలు కాంక్షలు అణచివేయబడి, సఫలం కాక ఆక్రందనలు చేస్తున్నాయి. అవి నెరవేరటానికి మొరపెడుతున్నాయి. వాటిలో ఒకటి, ఉపే క్షింపబడ్డ అందుబాటులోని ఆనందాలకోసం పరితపిస్తోంది. అది అలా ఉండగా, అందని మృగతృష్ణల వెంబడి పరుగు పెడుతూ మనం మనజీవితాల్ని కృశింపచేసుకుంటున్నాం.

సులభసాధ్యమైన ఆనందాలవల్ల ఏర్పడ్డ శూన్యత నా జీవితంలో నిరంతరం పెరిగిపోతోంది. నా గతజీవితాన్ని నేను తిరిగి పొందగలిగితే, అందని ఫలాలకు అర్రులుచాచడం విరమించి, కోరకుండా లభిస్తున్న చిన్నచిన్న దైనందిన ఆనం దాల్ని - జీవితం ఏవయితే ప్రసాదిస్తుందో వాటినే-పూర్తిగా అనుభవిస్తాను.

షాజెద్‌పూర్
27—6—1892

నిన్నమధ్యాహ్నం కారుమేఘాలు దట్టంగా క్రమ్ముకుని గర్జించసాగాయి. నాకు ఒకవిధమయిన భయం కలిగింది. లోగడ ఎన్నడూ ఇలాంటి భయంకర మేఘాన్ని చూసినట్లు నాకు జ్ఞప్తి లేదు.

పొంగిన గాఢాతిగాఢమైన నీలిమేసురాసులు ఒకదానిపై ఒకటి దొంతర దొంతర్లుగా దిగంతాలమీద పేరుకుంటూ, రూక్షతామ్రాక్షుడయిన రాక్షసుని మబ్బుమీసాల్లా ఉన్నాయి.

రంపపు పళ్ళలావున్న ఆ మేఘాల దిగువ అంచులదగ్గర ఏదో రక్తారుణిమ ధగధగా మెరుస్తోంది. అదెలా ఉన్నదంటే- ఆకాశాన్నంతా ఆవరించి, ఆగ్రహావేశంతో భూమిని గ్రుద్దటానికై తలదించి సిద్ధంగావున్న భయంకర కారెనుపోతు జ్వలితనేత్రాల్లోని రక్తకాంతిలా ఉంది.

తమకు రాబోయే విపత్తునుచూచి పొలాల్లోని పైరులు చెట్ల ఆకులు భీతితో ఒణకసాగాయి. నదీజలాలు భయకంపితమయ్యాయి. కాకులు భయాందోళనలతో కావుకావు మని అరుస్తూ పరుగెత్తసాగేయి.

షాజెద్‌పూర్
29-6-1892

ఈనాటి సాయంత్రం కాళిదాస మహాకవితో గోష్ఠికై కార్యక్రమం ఏర్పాటుచేసుకున్నానని నిన్నటిజాబులో నీకు

వ్రాసేస్కూ దీపం వెలిగించి, టేబిలుదగ్గరకు కుర్చీలాక్కొని సిద్ధంగా వుండేసరికి లోపలకు అతను వచ్చేసాడు. ఆవచ్చిన వ్యక్తి కాళిదాసు మాత్రంకాదు. పోస్టుమాస్టరు! సజీవంగా వున్న పోస్టుమాస్టరు మరణించిన కవీశ్వరుని కన్న ఆధిక్యత కోరడం సహజంకదా! అందుచేతనే "కాళిదాసుకు కేటాయించిన ఈ సమయంలో మరొకరితో మాటాడను మీరు దయ చేయండి" అని అతనితో స్పష్టంగా చెప్పలేకపోయాను. ఒకవేళ చెప్పినా నన్నతను అర్థంచేసుకోలేక పోయేవాడు! అంచేత అతనికి ఓ కుర్చీవేసి కూచోబెట్టి, పురాతన కావ్య కాళిదాసుకి నమస్కారం పెట్టి పంపించేసాను

ఈ పోస్టుమాస్టారుకూ నాకూ ఒకవిధమయిన స్నేహ బాంధవ్యం ఏర్పడింది. మా ఎస్టేటు భవంతిలో ఒక భాగంలో పోస్టాఫీసు ఉంటూండగా, ఆయన్ని ప్రతిరోజూ నేనుకలుసుకునేవాణ్ని. ఈ గదిలోనే కూచుని "పోస్టుమాస్టరు" కథను ఒకానొక మధ్యాహ్నం వ్రాసేను. హితవాది పత్రికలో ఆ కథ ప్రచురింపబడగానే, అతను ముసిముసినవ్వులు నవ్వుతూ నాదగ్గరకు వచ్చేడు. నే వ్రాసిన విషయాన్ని ఎత్తిపెట్టేడు. తన అయిష్టాన్ని ప్రకటిస్తూ ఏమయినప్పటికి అతనంటే నాకుఇష్టం. అతనిదగ్గర కథలనిధి ఉంది. వాటన్నిటినీ కుతూహలంతో వింటూ ఆనందిస్తూంటాను. అతనిలో కాస్త హాస్యరసంకూడా ఉంది.

పోస్టుమాస్టరు నాతో మాటాడి వెళ్ళేసరికి ఆలస్యం అయినప్పటికీ, నేను రఘువంశ కావ్యంతీసి ఛకచకా చదవటం

ప్రారంభించేను. ఇందుమతీ స్వయంవర ఘట్టం పూర్తిగా చదివేసాను.

ఆ నిండుసభలో, అందచందాలతో ఒప్పుతూ, సమస్త భూషణాలంకృతులై, అపరమన్మథుల్లా ఉన్న రాచకుమారులెందరో సింహాసనాల్లో బారులు తీర్చి కూర్చున్నారు. ఇందుమతి సర్వాలంకార శోభితయై స్వయంవరోచిత దుస్తులతో సునందతో కూడుకుని ఆ సభాస్థలిలో ప్రవేశించగానే శంఖారావాలు, తూర్యనాదాలు ఒక్కసారి మారుమ్రోగి దశదిశలూ నిండేయి. ఆ సుందర దృశ్యాన్ని ఒడలంతా కనులు చేసుకుని చూడాలనిపించింది.

ఆ తరువాత అక్కడున్న ప్రతి రాచకుమారుణ్ణి సునంద పరిచయం చేస్తూండగా, ఇందుమతి నతవదనయై అనురాగ రహితమైన క్రీగంటి చూపులు చూస్తూ వినమ్రయై ఒక్కొక్కరినే దాటి వెళ్ళిపోయింది. ఆమె చూపేమర్యాద ఎంతఅందంగా ఉంది! అక్కడ కూచున్న వారందరూ రాచకుమారులు. వయస్సులో తనకన్నా పెద్దవారు. తనో! చిన్నారి బాలిక! వారందరినీ ఆమె ఆ స్వయంవరంలో తిరస్కరించింది. ఆ తిరస్కారాన్ని తన నమ్రతచేత, సౌశీల్యాములచేతా శాంతింప చేయక పోయినట్లయితే, ఆ స్వయంవర దృశ్యంలోని అందం అంతా చెడిపోయేది.

షెలీ డా,
20-8-1892

"అక్కడ నేను నివసిస్తే ఎంత హాయిగా ఉంటుంది!" అనిపిస్తుంది, ఏదయినా సుందర ప్రకృతి వర్ణచిత్రాన్ని చూడ

గానే. అటువంటి కోరికే ఇక్కడ తృప్తి పరచబడింది. ఉజ్జ్వలమయిన వర్ణచిత్రంలో కలిగిన ఆనందాన్నే నేను పొందేను. కాని వాస్తవిక జీవితంలోని కఠోరత మాత్రం ఇక్కడ కనుపించలేదు. నేను బాలుడుగా ఉన్నప్పుడు "పాల్ అండ్ వర్జీనియా" చిత్రాల్లోనూ, "రాబిన్ సన్ క్రూసో" చిత్రంలోనూ చిత్రించబడ్డ అరణ్యం, సముద్రం నన్ను దైనందిన ప్రపంచం నుండి ఎక్కడకో తీసుకుపోయేవి. ఇప్పుడు ఇచ్చట గల సూర్య రశ్మి ఆనాటి ఆనందానుభూతుల్ని తిరిగి స్ఫురణకు తెస్తూన్నది.

నాలో రేకెత్తిన కోరిక స్వరూప స్వభావాలు సరిగ్గా వివరించలేక పోతున్నాను. అది ఈ విశాల ప్రపంచంతో నాకు సంబంధం ఏర్పరుస్తూన్న ధమనిగుండా పారుతూన్న ఆనంద ప్రవాహం యొక్క స్పందనలా అగపడుతూంది. మిగతా పృథ్వి నేనూ ఒకటిగా ఉన్నప్పుడు- నామీద పచ్చగడ్డి మొలచినప్పుడు - నామీద శిశిరకాంతి పడినప్పుడు - బాలభానుని ఉపయాయన కిరణాల మధురస్పర్శకు నా కోమల హరిత శరీరం తాలూకు ప్రతి రోమకూపంనుంచీ వెచ్చని యవ్వన పరిమళం గుబాళిస్తూన్నప్పుడు ఒక నవ్యజీవితం, ఒకతీయని సంతోషం అవ్యక్తంలో నానుండి ప్రసవించినప్పుడు- వివిధ దేశాలతోను, సముద్రాలతోనూ, పర్వత శ్రేణులతోనూ కలసి మాటాడకుండా విశాల వినీలాకాశం క్రింద కాళ్ళు చాచుకొని పడుకుని ఉన్నప్పుడు - ఏ ఆనందమయితే అనుభవించేనో, ఆ ఆనంద కాలం యొక్క అస్పష్ట సుదూరస్మృతులు తిరిగి నాదగ్గరకు వచ్చినట్లు అనుభూతి పొందేను.

బాలభానుని ముద్దులతో అనునిత్యం ఆనంద తరంగి

తగా ఉండే పురాతన పృథ్వి పొందిన అనుభూతుల్లా ఉన్నాయి నా అనుభూతులు కూడా. వృక్షాలలో జీవరసంతో కలసి పైకి విజృంభించటానికి గానూ - లాస్యంచేస్తూన్న వరిపైరుల్లోనూ, గలగలా రావంచేస్తూన్న తాటి ఆకులలోనూ ఆనందోద్రేకంతో వికసించటానికి గానూ, నా చైతన్యం ప్రతి ఒక్క గడ్డి పోచనుండానూ, భూమిలో ఉండే ప్రతి ఒక్క పీల్చే వేరు గుండాను ప్రవహిస్తోన్నట్లు అగపడుతోంది.

పృథ్వితో నాకు గల రక్త సంబంధాన్ని, బంధుప్రేమను వ్యక్తం చేయ నాలో ఒక ప్రేరేపణ కలిగింది. గాని నన్ను అర్థం చేసుకోవడం జరగదేమో అని భయపడుతున్నా.

బోలియా

18-11-1892

ఈపాటికి నీ ట్రెయిను ఎక్కడ ఉంటుందని ఆలోచిస్తున్నాను. నవాదియా రైల్వేస్టేషనుకు సమీపాన చెట్లూ చేమలుక, నిమ్నోన్నతాలతో కూడుకున్న రాతిప్రదేశంలో సూర్యోదయం అయేసమయం ఇది. ఆ చుట్టూ గల ప్రకృతి సౌందర్యం సూర్యప్రభచేత మరీ ఎక్కువ ప్రకాశిస్తూ ఉండాలి. దూరానగల నీలికొండలు ఆ సూర్యకాంతిలో కొంచెం కొంచెం దృగ్గోచరం కావచ్చు. అక్కడ సాగుచేయబడుతూన్న పొలాలు మాత్రం చూడటానికి బహు అరుదుగా కనబడుతాయి. అనాగరిక కొండజాతి వారిచేత దుక్కి ఎద్దుల సహాయాన స్వల్పంగా దున్నబడిన భూములు అక్కడక్కడ మాత్రం దృష్టికి గోచరిస్తాయి. రైలుకట్టకు ఇరుప్రక్కలా గుట్టలుగుట్టలుగా పడిఉన్న నల్లపాషాణాలు, అణచుకుపోయిన

సెలయేటి ప్రవాహాల అడుగు జాడలకు గుర్తుగా ఉన్న బండ రాళ్ళూ, టెలిగ్రాఫ్ తీగలమీంద కూచుని తోకలు ఆడిస్తూ వింతగా ఊగుతూన్న కాటుక పిట్టలు ఆ రైలు పోయే మార్గంలో కనబడుతూంటాయి. గాయాలమచ్చలతోను, కుట్లతోను ఉన్నట్లున్న అక్కడ భయంకర ప్రకృతి, ఏదో ఒక దేవతామూర్తి మృదుమధుర హస్త స్పర్శచేత లాలింపబడుతూ సూర్యరశ్మిలో పడుకొన్నట్లుగా అగపడుతుంది.

ఇంతవరకు నే వర్ణించిన చిత్రం దేన్ని స్ఫురణకు తెస్తూన్నదో నీకు తెలుసా? కాళిదాస కవిశేఖర విరచిత శకుంతలా నాటకంలో ఒకరంగం వుంది. అందులో దుష్యంత మహారాజు కుమారుడైన భరతుడు పసివాడుగా ఉన్నప్పుడు సింగపుకొదమతో ఆటలాడుకొంటూన్న దృశ్యం ఒకటిఉంది. ఆ బాలుడు గులాబీలవంటి తన మృదులాంగుళిలను మృగరాజైన ఆ సింహకిశోరపు బిరుసు జూలులోనికి ప్రేమపూర్వకంగా పోనిచ్చి దువ్వుతున్నాడు. ఆ సింహకిశోరం కదలిక మెదలక, అతివిశ్వాస భంగిమలో ప్రశాంతంగా కాళ్లుచాచుకొని పడుకుని ఉంది. మధ్యమధ్య ప్రేమార్ద్రనేత్రాలను ఆ చిన్నారి మానవునిపై బరపుతూంది.

బండరాళ్ళతో నిండి, ఎండిపోయిన ఆ సెలయేటి ప్రవాహాలు నాకు ఏమి జ్ఞాపకం చేస్తున్నాయో తెలుసా? "అరణ్యంలో పసిపాపలు" అన్న ఇంగ్లీషు కథలో అన్నాచెల్లెలు అయిన ఇద్దరు పాపలు తమ సవతి తల్లిచేత అరణ్యంలో విడవబడ్డారు. ఆ పిల్లలిద్దరూ ఆ దుర్గమారణ్యంలో తిరుగుతూ తమ అడుగుజాడలు ఇతరులకు తెలిసే నిమిత్తం, వెళుతూ

వెలుతూ చిన్నగులకరాళ్లను దారిపొడుగునా పోస్తూ వెళ్ళేరట. ఇది మనం ఆకథలో చదువుకున్నాం. ఈ సెలయేళ్లుకూడా దారి తప్పిన ఆ పసిపాపల్లాగే ఈ మహాప్రపంచలోకి తరిమి వేయబడి దిక్కుగానక పరుగులు పెడుతూన్నట్లు గోచరిస్తాయి. ప్రవహిస్తూ తమ అడుగుల జాడలు తెలియటానికిగానూ ఈ రాళ్ళను గుర్తుకు వదలి పెడుతూంటాయి. తిరుగు ప్రయాణం ఎప్పుడయినా చేయవలసి వచ్చిననాడు తాము వచ్చిన దారి మరచిపోకుండా వుండడానికి ఈరాళ్ళు ఉపకరిస్తాయి అని అవి అనుకుంటాయి. గాని, పాపం వాటికి తిరుగు ప్రయాణం లేదే!

సేటోరు

2-12-1892.

అంతులేని ఒంటరి పొలాల కావల, దిగంతవ్యాప్తంగా వున్న వృక్షాల వెనుక గోచరించే వంగదేశ సూర్యాస్తమయంలో గొప్ప భావ గాంభీర్యం, అపరిమిత ప్రశాంతం నిండి వున్నాయి.

ఒక్క ప్రేమతోనేగాక విచారంతోకూడా మా సంధ్యాకాశం వంగి, భూమిని ఎక్కడో దూరాన కలుసుకుంటుంది. భూమిని విడిచి వెళుతూ విషాదార్ద్రమైన వెలుగును భూమిమీద ప్రసరిస్తుంది. ఆ వెలుగు ప్రకృతి పురుషుల ఎడబాటులో కలిగిన లోకోత్కృష్ట ఖేదాన్ని మనకు చవిచూపిస్తుంది. ఆ సమయంలో పృథ్వి, ఆకాశ, జలాలమీద నిశ్శబ్దం ఆవరించి ఊరట కన్పిస్తూంటుంది.

ఆ నిశ్శబ్దాన్ని అలా నిర్నిమేషంగా తిలకిస్తూండగా, నాకు కలిగిన ఆశ్చర్యం అపరిమితం. ఈ నిశ్శబ్దం ఇలా తనలో

తను ఇమిడి ఉండ లేకపోయినట్లయితే, సృష్ట్యాదినుంచీ ఏ శుభ సమయానికై ఈ ఘడియ అనుదినం నిరీక్షిస్తూన్నదో, ఆ సమయం వచ్చేసి నిశ్శబ్ద భంగీకరణ జరిగినట్లయితే, అత్యంత గంభీరమై. అతి పవిత్రమై, హృదంతరాళాలను ఉగ్రూత లూగించే గానం పృథ్వినుంచి నక్షత్రమండలం వరకు ఉవ్వెత్తైన లేవకుండా వుంటుందా ?

ఏకాగ్రమనస్కతతో, దృఢప్రయత్నం ఏ కొద్దిగా చేసినా, విశ్వవ్యాప్తమైన కాంతి, రంగుల దివ్యసమ్మేళనాన్ని మధుర మంజుల సంగీతంగా రూపొందించగలుగుతాం. మనం చేయవలసిందల్లా నేత్రాలు మూసుకొని, మనోశ్రోత్రంతో నిరంతరం ప్రవహించే ఈ సుందర సమ్మేళనంలోని ధ్వని తరంగాలను గ్రహిస్తూండడమే !

ఈ సూర్యాస్తమయ, సూర్యోదయాలను గురించి మాటిమాటికి ఎంతని వ్రాయడం ? వాటిలోని నిరంతర నవ్యతను, ఎప్పటికప్పుడే నేను అనుభూతి పొందుతున్నాను. అయినప్పటికీ ఆ నిత్య నవ్యతను, నా భావ వ్యక్తీకరణలోనూ, రచనలోనూ ఏ విధంగా సిద్ధి పొందగలను ?

షెలీదా

9-12-1892

నేను జబ్బుతో బాధపడి లేచేక, చాలా నీరసంగా ఉన్నాను. ఆరోగ్యాన్ని మెల్లగా కోలుకుంటూన్న ఈ స్థితిలో ప్రకృతి చేస్తూన్న ఉపచారాలు నిజంగా ఆపాతమధురంగా వుంటాయి. అందరికిమల్లే నేనూ సూర్యరస్మిలో వెచ్చగా చలి కాగుతూ, ఆనందిస్తూ సోమరిగా ఉంటున్నాను. ఉత్త

రాలు ప్రాయటం సాగుతూనే వుంది. కాని అది పగధ్యా
నంగా జరుగుతూంది.

నాకు ఈ ప్రపంచం నిత్యనూతనంగానే ఎల్లప్పుడూ గోచరిస్తూంటుంది. ఈ జన్మలోనే గాక గత జన్మల్లోకూడా ప్రేమించబడుతూన్న పాత స్నేహితునివలె, యీ ప్రపంచానికీ నాకూ మధ్యగల పరిచయం చిరకాలమయింది, గాఢమయింది.

నేను ఒకటి బాగా గ్రహించేను. కొన్ని యుగాలక్రితం తొలి యవ్వనంలో వున్న భూమాత తన సముద్రం స్నానం ముగించుకొని బయటికి వచ్చి, ఉదయభాస్కరునికి నమస్కరిస్తూ ప్రార్థించుచుండగా, క్రొత్తగా రూపొందిన ఆ ఇలాతలంనుంచి ఉద్భవించిన తరువులలో నేనొక తరువునయి, ఆనందపు పులకలు మొలకలెత్త తలిరాకులను నల్మువైపులా విస్తరింపజేసే ఉంటాను.

ఆ మహాసముద్రము తన ప్రపథమ కాన్పు అయిన పృథివీ శిశువును ఊయల ఊపుతూ, అద్దాలలో వేసుకుని ఆడిస్తూ, ముద్దులతో ఊపిరి తిరుగనీయక, పిచ్చి ప్రేమగల తల్లిలా మాటిమాటికీ లాలిస్తూనే వుంది. ఇక్కడ నేనో! నీలాంబరం క్రింద, నూతన శిశు సహజమైన అకారణ ఆనందావేశంతో అటూ, ఇటూ కదలుతూ, నా వ్రేళ్ళన్నిటితో నా పృథ్వీమాతను గట్టిగా పట్టుకొని, సూర్యకాంతిలో ఆమె స్తన్యాన్ని గ్రోలుతూ ఉన్నాను. సంతోషం పట్టలేక నా ఆకులన్నీ చిగిర్చి వేశాయి. నా పూవు[illegible] వికసించేశాయి.

కారుమేఘాలు క్రమ్ముకొన్నప్పుడు, వాటి యింపైన ఛాయల మృదుస్పర్శతో నాకు సుఖాన్ని సమకూరుస్తున్నాయి.

అప్పటినుంచీ ప్రతీ యుగంలోనూ ఈ ధరిత్రిలో రకరకాలైన ఎన్నో జన్మలు ఎత్తుతూనే వున్నాయి. ఆ కారణం చేతనే మేము ఉభయుం ఒకరికొకరం అభిముఖంగా కూర్చున్నప్పుడల్లా, రకరకాలైన పురాస్మృతులు ఒకదాని వెంబడి ఒకటి అక్షయంగా నా దగ్గరకు వస్తూవుంటాయి.

యీ నాడు, నా భూమాత సూర్యప్రకాశితమైన సువర్ణ వలువలు ధరించి, నదీతీరానగల వరిపొలాల్లో కూచునివుంది. ఆమె పాదాలచెంత, మోకాళ్ళ సమీపాన, ఒడిలో నేను దొర్లుతూ ఆడుకుంటాను. అసంఖ్యాకమైన బిడ్డలగన్న అ పృథ్వీమాత, తన బిడ్డల పిలుపులను వింటూ, వారి అవసరాలను గుర్తెరిగి తను ఎక్కడోఉండే వాటిని తీరుస్తూ వుంటుంది. ఆ ధరిత్రీమతల్లి ప్రదర్శించే క్షమ అపరిమితమయింది. గాని ఆమె ఎందుకో ఒంటరిగా దూరదూరంగా కూచుంటుంది. ఆమె అక్కడ కూచుని, అపరాహ్ణ ఆకాశపు టంచుల మీదికి దృష్టి సారిస్తూండగా, ఇక్కడనేను గుక్క తిప్పకుండా ఏకబిగిని వాగుతూనే వున్నాను.

బాలియా,

ఫిబ్రవరి, 1893 (మంగళవారం)

ఇటుపైని ఎక్కడకూ నేను తిరుగదలుచుకోలేదు. మానవ సమాజానికి దూరంగా వెళ్ళిపోయి, ఏ మూమూలో వెచ్చగా విశ్రమిం[illegible] తపిస్తున్నాను.

హిందూదేశంలో రెండు విధాలయిన దృక్పథా లున్నాయి. ఒకటి గృహస్థాశ్రమం. రెండు సన్యాసాశ్రమం. గృహస్థాశ్రమంలో గృహస్థుడు తన గృహాన్ని విడచి ఒక అంగుళంకూడా కదల నిరాకరిస్తాడు. సన్యాసాశ్రమంలోవున్న సన్యాసికి ఊరూ వాడా తిరగడం తప్ప ఒక గృహమంటూ లేనేలేదు. యీ ఇద్దరూ నాలో కనబడుతున్నారు. యథే చ్ఛగా తిరిగి, యీ విశాల ప్రపంచాన్నంతా సందర్శించాలని నేను అభిలషిస్తున్నాను. అంతే కాకుండా, తల దాచుకునేం దుకు ఏదయినా చిన్న కుటీరం ఏ మారుమూలయినా దొర కాలని కోరుకుంటున్నాను. నివసించటానికి చిన్నిగూడు, స్వేచ్ఛా సంచారానికి సువిశాల ఆకాశం పక్షికి ఉన్నట్లుగానే నాకూ అవి వుండాలి.

నేను ఓ చిన్న మారుమూలకోసం ప్రాకులాడటానికి కారణం అక్కడ నా మనస్సుకు ప్రశాంతత సమకూరటానికి అవకాశం ఉన్నది. నా మనస్సు పుష్కలంగా పనిని వాంఛి స్తుంది. హుషారుగా విహరించాలనుకుంటుంది. ఆ ప్రయ త్నంలో అది జనసమూహాన్ని చూసి తల బాదుకుంటూ, దాని పంజరాన్ని అయిన నన్ను లోపలనుంచి ముక్కుతో పొడుస్తూంటుంది. దానికి కాస్త విశ్రాంతి, ప్రసాదించినట్ల యితే, స్వేచ్ఛగా నలుదిక్కులాచూచి తృప్తిగా ఆలోచించ టానికి అవకాశం కలిగించినట్లయితే, అది తన మధుర భావాల్ని హృదయపూర్వకంగా వ్యక్తం చేస్తుంది.

ఈ ఏకాంతవాస స్వేచ్ఛకోసమై నా మనస్సు పరిత పిస్తోంది. సృష్టికర్త తన సృష్టిని తిలకిస్తూ ఆలోచిస్తూన్న

ట్లుగా, నా మనస్సు తన భావనలతో ఏకాంతంగా ఉంటూ న్నది.

కటక్

ఫిబ్రవరి 1893

ఏదయినా కొంత ఘనత సాధించే వరకు అజ్ఞాతంగానే జీవిద్దాం అంటాను నేను. మనం అగౌరవంగా చూడబడ టానికే తగిన స్థితిలో ఉన్నంతకాలం, దేన్ని ఆధారం చేసుకుని గౌరవాన్ని కోరుతాం ? నిలబడటానికి స్థలాన్ని మనంతట మనం ప్రపంచంలో సంపాదించుకున్నాక, మన జీవిత గతిని తీర్చి దిద్దుకునే బాధ్యతలో మనకు భాగస్వామ్యం లభించేక, అప్పుడే, ఇతరులను చిరునగవు ముఖంతో కలుసుకో గలుగుతాం.

గాని మన దేశస్థులు దానికి వ్యతిరేకాభిప్రాయాన్ని కలిగి ఉన్నట్లున్నారు. మనకు సహజమైన కోరికలను, సుగుణ సంపదను అజ్ఞాతంగా పెంపొందించుకుంటూ ఉండక, తమ దృష్టినంతా అసహజమైనటువంటివన్నీ, క్షణికమయినటు వంటివన్నీ భావప్రకటనల కేసి, ఆడంబర ప్రదర్శనల కేసి పరుగు లెత్తిస్తున్నారు.

మన దేశం నిజానికి మహా దుస్థితిలో ఉన్నదని చెప్పాలి. పనిచేయటానికి అవుసరమయిన సంకల్ప బలాన్ని దృఢంగా నిలబెట్టుకోవాలంటే మహాకష్టం అయిపోతోంది. మనకు కావలసిన నిజమయిన సహాయము లభించటంలేదు. మాటా మంతీ ఆడుకొని, మన శక్తి సామర్థ్యాలను ఆత్మబలాన్ని ఆతని సహాయంవలన తిరిగి పుంజుకుందామన్నా వేలాదిమైళ్ళ

దూరంలోకూడా ఏ ఒక్క ఆంతరంగిక మిత్రుడూ కనుపించలేదు సమీపాన ఉన్నవాళ్ళలో ఒక్కడూ, మనలనుగురించి ఆలోచిస్తున్నట్లుగాని, బాధపడుతున్నట్లుగాని, పనిచేస్తూన్నట్లుగాని కనబడలేదు. మనలో ఏ ఒక్కనికీ ఘనకార్యములు చేయడంలోగాని, నిజమైన జీవితాన్ని జీవించడంలోగాని ఏ మాత్రం అనుభవంలేదు. అందరూ తింటున్నారు. త్రాగుతున్నారు. ఆఫీసుల్లోపనులు చేసుకుపోతున్నారు. చుట్టలు, సిగరెట్లు కాలుస్తున్నారు. నిద్రిస్తున్నారు. పిచ్చిపిచ్చిగా వాగుతున్నారు. ఉద్రేకం వచ్చిందంటే క్షణంలోనే చల్లారిపోతుంది. వాదనలకు దిగినప్పుడుచిన్నపిల్లలుగా తయారవుతున్నారు. ఎవరయినా ఉత్సాహోల్లాసాలతో ఉరకలు వేస్తున్న శక్తివంతమైన నిండు జీవితాన్ని కోరుకుంటాను. గాని వీళ్ళంతా ప్రపంచంతో ఏ సంబంధం లేక పరుగులుపెట్టే అసంఖ్యాక ఛాయలు మాత్రమే.

కటక్

10—2—1893

వంపుతిరిగిన పొడుగాటి ముక్కు, కపటంతో నిండిన కళ్ళు. సగం గడ్డంకలిగి, దార్జ్యముతాను చెంది నిండుగా పెరిగిన అతడే అభినవ జాన్ బుల్.

న్యాయస్థానాల్లో జ్యూరీ చేత విచారణ చేయబడటానికి మనకున్న హక్కును తగ్గించటానికై ప్రస్తుతం ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఆ అభినవ జాన్ బుల్ యువకుడు ఆ విగ్రహాన్ని చెవులు పట్టుకుని ఈడ్చుకువచ్చి, మాకు అతిథిగా వచ్చిన అమాయకపు "బి—బాబు"ను వాదించమని బల

వంతం చేయసాగేడు. ఆ యువకుడు ఈ దేశ ప్రజల నైతిక స్థాయి చాలా తక్కువ అని, ప్రాణి జీవితంయొక్క పవిత్రతలో వాళ్ళకు నిజమయిన విశ్వాసం లేదని అందుచేతనే జ్యూరీలలో సభ్యులుగా పనిచేయటానికి వారు అనర్హులని శెలవిచ్చాడు.

వంగీయుని ఇంటికి వచ్చి అతడిచ్చే ఆతిధ్యాన్ని స్వీకరిస్తూ అతనిముందే భారతీయులను ఆ విధంగా అసభ్యంగా తూలనాడి పశ్చాత్తాపమన్నది లేశమయినా ఏకోశానా లేని ఆ యువకుని ధోరణి చూస్తే, మనం అంటే ఈ వ్యక్తులకు ఎంత అసహ్యమో సుస్పష్టం అవుతూంది.

విందు అనంతరం, అతిధి గదిలో ఓ మూల కూర్చున్న నాకు, కళ్లు తిరిగిపోయి, చుట్టుప్రక్కలంతా మసక మసకగా కనపడసాగింది. అవమానంతో క్రుంగి ఓదార్చే దిక్కులేక శోభా రహితమై నా కళ్ళముందే మట్టిలో పడివున్న నా మాతృభూమి పవిత్ర శిరస్సు ప్రక్కనే, నేను కూచుని ఉన్నట్లు అనిపించింది. ఆ సమయంలో నేను పొందిన దుఃఖము మాటలతో చెప్పలేను.

ఆ సమయంలో సాయంసంధ్య స్తులు ధరించి, ఇంగ్లీషులోనే ఏదో గొణుగుకుంటూ, నవ్వుల అలలలో తేలియాడుతూ, నిర్విచారంగా అక్కడ సంచరిస్తున్న మేమ్ సాహెబ్ లను, చూస్తే ఎంత కష్టమనిపిస్తుంది ! అంత పురాతనమైన మన హిందూ దేశం నిజంగా ఎంత సుసంపన్న మయింది ! ఇంగ్లీషు విందు భోజనంలోని డాంబిక మర్యాదలు ఎంత చవకబారువి. అవన్నీ పై మెరుగులతో కూడినవే !

కటక్

మార్చి 1893

ఇంగ్లీషువారి పోగడ్తలకు అత్యధిక ప్రాముఖ్యత ఇవ్వటం ప్రారంభించినట్లయితే, మనలో ఉన్న మంచి అంతా పోగొట్టుకుని, వాళ్ళదగ్గరనుంచి ఎక్కువ చెడుని స్వీకరించవలసి వస్తుంది. మేజోళ్ళు లేకుండా బయటికి వెళ్ళటానికి సిగ్గు పడతాం. కాని విందు నృత్యాలలో వారు ధరించే దుస్తులను చూడటానికిమాత్రం ఏ మాత్రం సిగ్గుపడం. మన పురాతన సాంప్రదాయాలను,మర్యాదలనుకాలదన్నినందుకు గాని, వారి మర్యాదా రహిత ప్రవర్తనలను అలవరచుకున్నందుకు గాని, మనం కించిత్తయినా పశ్చాత్తాపం పడటంలేదు. మనం తలపాగాలు ధరించటం మానివేశాం – అని ఇంకా అభివృద్ధి కరమయిన మార్పులు పొందాలని – గాని వాళ్ళ టోపీలకు మన తలకాయలను లోబరుస్తున్నామన్న ఆలోచనే చేయం. శిరస్సుకు ధరించినది ఏదయినాసరే అందవికారంగా వుండ జాలదు.

మొత్తంమీద, ఏ విధంగా అయితే ఇంగ్లీషువారు సంతోషించి తప్పెటలు కొడతారో, ఆ విధంగా మన జీవితాలను కుదించుకుని జీవించడానికి మనం ప్రయత్నిస్తున్నాం తెలిసో, తెలియకో–

అందుచేతనే నాకు నేనే చెప్పుకుంటున్నాను ఈ విధంగా "ఓ మట్టిఘటమా! నీ పుణ్యాం వుంటుంది. ఆ లోహ ఘటానికి మాత్రం కొంత దూరంగా ఉండుమీ! ఆ లోహ ఘటం నా దగ్గరకు కోపంతో వచ్చినా, లేక నీపుమీద

తడుతూ ఉత్సాహ పరచటానికి వచ్చినావసలే, నీవు స్వాహా అయిపోతావ్! అందుచేతనే వృద్ధ ఈసఫ్ ఋషి సాక్షాను పాటించు మా! నిన్ను ప్రార్థిస్తున్నాను. "దూరంగా వెళ్ళిపో".

ఆ లోహఘటం జమీందారుల ప్రాసాదాలను అలంక రించనీ. నీకు బీదల ఇళ్ళల్లో కావలసినంత పని వుంది. ఓ మట్టిఘటమా! నీవు పగిలిపోతే రెండుచోట్లాకూడా స్థానం ఉండదు. అలాంటప్పుడు నీవు మట్టి పాలేనా అవాలి. లేకపోతే మ్యూజియంలో ఓమాదుమూల పురాతన వస్తు చిహ్నంగా పడి అయినా వుండాలి అందుచేతనే వీటన్నిటికంటే ఉత్కృష్ట మైంది ఏదంటే అంత్య జాతి పల్లెపడుచుకు నీకు తెచ్చుకునేం దుకు ఉపయోగపడటమే!

షెలీదా
8-5-1893

కవిత అంటే చిరకాలం నుంచీ నాకు ప్రేమ. అయి దేళ్ళ వయస్సునుంచీ ఆమెతో నాకు సంబంధం వుంది. అప్ప టికి నాకు మా రతి వయస్సు వుంటుంది. మా కోనేరు ప్రక్క గల పురాతన మర్రి చెట్లక్రింద, లోపల గల ఉద్యానవనా ల్లోనూ, ఇంటిలో దిగువ భాగంలో నాకు తెలియని అనేక స్థలాలలో చాలా కాలంక్రితం విశ్రమించటాలు, బాహ్య జగత్తు యావత్తూ, దాదులు చెప్పిన చిన్నపిల్లల పాటలు, కధలూ, నాలో అద్భుతమైన గంధర్వలోకాన్ని సృష్టించేయి. బాగా తెలియకుండా, ఇంద్రజాలంలా జరిగిపోయిన ఆ దశలో వింతల్ని విశేషాలను, సమగ్రంగానూ, సుస్పష్టంగానూ, తెలియజ చెప్పటం కష్టం గాని ఒకటిమాత్రం ఖాయం. కవితా

సుందరితో పూలమాలలు పరస్పరం మార్చుకొని, ప్రధానం చేసుకోవడం అంతకు పూర్వమే శాస్త్రోక్తంగా జరిగి పోయింది.

నేను వరించిన కవితాసుందరి మాత్రం శుభప్రదాయిని అయిన కన్యకాదని మాత్రం నేను అంగీకరించి తీరాలి. ఆమె ఇంకేమి తెచ్చినా సరే, అదేమంత భాగ్యమేకాదు. ఆమె నా కెన్నడూ సౌఖ్యాన్ని ఇవ్వలేదని నేను చెప్పలేను గాని మనశ్శాంతి మాత్రం ఆమెతో వున్నంతకాలం మృగ్యం అనే చెప్పాలి. ఆమె కటాక్షానికి పాత్రుడయిన ప్రేమికుడు బ్రహ్మానందాన్ని పొందవచ్చు గాని అతని హృదయ రక్తాన్ని, తన నిర్దయాత్మకమైన కౌగిలింతలో సంపూర్ణంగా పిండి వేస్తుంది.

ఆమె వరించిన ఆ దురదృష్ట జీవి, సంఘంలో, సుఖ సౌఖ్యాలతో విలసిల్లుతూ, గృహస్థునుగా ప్రశాంత జీవితం గడపటం కలలో మాట.

ఎరిగో, ఎరగకనో సత్యదూరమైన పనులు ఎన్నో చేసే వుంటాను. గాని నేను నా కవితలో అసత్యాలను మాత్రం వచించలేదు. నా జీవిత అగాధ సత్యాలు తలదాచుకునే పవిత్ర గర్భాలయము. ఆ కవితే!

షెలీదా

10-5-1893

ఇక్కడకు తిరిగి దట్టమయిన కారుమేఘాలు వచ్చేసాయి. బంగారు సూర్యరశ్మిని. పెద్ద పెద్ద అద్దుడు కాగితాలకు మల్లే అవి లోనికి పీల్చుకుంటున్నాయి. గాలిలో తేమా,

కన్నీరు నిండుకున్నాయి కాబట్టి వర్షానికి ఎంతో వ్యవధి లే దన్నమాట. ఇక్కడకు వర్ష మేఘాలు రావటం ఎంత ముఖ్య మయిన సంగతో, ఎంతమంది ప్రజ ఆకాశం కేసి ఆతృతతో చూస్తూ, వాటి ఆగమనాన్ని ఎంతగా అభినందిస్తూ హర్ష ధ్వానాలు చేస్తుంటారో, అంబర చుంబిత పర్వత శిఖరాలు గల సిమ్లాలో వున్న నీకు అర్థం అవటం చాలా కష్టం. ఆజానుబాహులు, నిస్సహాయులు, పసిపాపల్లాంటి వారు అయిన మన రైతు బిడ్డలను చూస్తే నా హృదయం జాలితో ద్రవించి పోతుంది. దైవం వీళ్ళకు ఆహారం నోటికి అందిస్తేనే నిలబడటం లేకపోతే మలమల మాడిపోవటం జరుగుతుంది. భూమాత వక్షస్సు ఆరిపోయినట్లయితే కింకర్త వ్యతా విమూఢులై బిగ్గరగా రోధిస్తూ కూచుంటారు. అంతే! వాళ్ళ క్షుదార్తిని తృప్తిపరచినట్లయితే, ఆ మరుక్షణమే తమ వెనుకటి బాధలన్నిటినీ పూర్తిగా మరచిపోతారు.

దేశ సంపదనంతా సమాజంలో ప్రతి ఒక్కనికీ సమానంగా పంపిణి చేయాలి అన్న సోషలిజం యొక్క సిద్ధాం తం ఆచరణ సాధ్యమవుతుందో కాదో నాకు తెలియదు. అలా సాధ్యమే కాని పక్షంలో, దైవంయొక్క పంపిణీ చాలా క్రూరమైనదనీ, మానవుడు నిజంగా దురదృష్ట జీవి అనీ అనాలి. ఈ లోకంలో ఈ దౌర్భాగ్యం ఉండాల్సి ఉంటే వుండనీ. కాని, కాస్త అవకాశం, రవంత ఆశాకిరణం తొంగి చూడనీ. దానివల్ల మానవజాతిలో కొందరు మహనీయులు ఉత్తేజితులయి జాతి తరుణోపాయంకోసం స్వార్థరహితంగా నిరంతరం పోరాటాలు సాగిస్తారు.

ప్రతి ఒక్కనికి తినడానికి ఇంత తిండి, కట్టుకునేందుకు కాస్త గుడ్డ ఉండేందుకుగాను ప్రపంచంలోని ఉత్పత్తిని యావత్తూ పంపిణీ చేయడం పగటి కలమాత్రమే అనేవాళ్ళు ఉన్నారు. ఏమంటే అది కష్టమైన పని అంటున్నారు. సాంఘిక సమస్యలన్నీ నిజంగా కష్టమయినవే! మానవ జాతికి ప్రారబ్ధం చాలీచాలని దుప్పటినే ప్రసాదించింది. దాన్ని ఒక ప్రక్క ప్రపంచం కప్పుకుంటే రెండో ప్రక్క ప్రపంచానికి లేకుండానే పోతుంది. మన పేదరికాన్ని నిర్మూలించటానికి జరిపే ప్రయత్నాలలో మనకున్న స్వల్పపాటి సంపదనుకూడా పోగొట్టుకుంటున్నాం. ఆ పోయిన సంపదతో మన ఠీవి, మన సౌందర్యం, మన శక్తి అన్నీకూడా ఎంతలా పోయేయి!

పశ్చిమాన కారుమేఘపంక్తులు బ్రహ్మాండంగా ఉన్నప్పటికీ, సూర్యుడు ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూనే వున్నాడు.

పె.లీదా

11-5-1893

ఇక్కడ నాకు మరొక సరదా వున్నది. భక్తి ప్రపత్తులు కలిగి అమాయకులైన వృద్ధ రైతులు ఎవరో ఒకరు నన్ను చూడడానికి అప్పుడప్పుడు వస్తూనే వున్నారు. వాళ్ళకు నా యందు గల పూజ్యభావం లవలేశమైనా చెక్కు చెదరలేదు! వాళ్ళ భక్తిలోని సుందర నిరాడంబరత్వం, నిజాయితీ చూస్తే నా కన్నా వాళ్ళే ఎంతో గొప్పవారు అనిపిస్తోంది. వాళ్ళు చూపే గౌరవానికి నేను అయోగ్యుడను అయితే నేం! వాళ్ళ భావనలకు గల విలువలు మాత్రం ఏం తగ్గలేదు!

చిన్న పిల్లలను ఎంత ప్రేమతో చూస్తానో, అంత ప్రేమతోనూ యీ పెద్ద పిల్లలనుకూడా చూస్తాను. కాని ఒక తేడా మాత్రం వుంది. ఈ పెరిగిన పెద్దవారు, ఇంకా మరీ పసిపాపల్లా ఉన్నారు. చిన్నపిల్లలు పెరిగి పెద్దవారవుతారు గాని ఈ పెద్దపిల్లలు మాత్రం ఇహ పెరగలేరు.

సాధుత్వము, స్వచ్ఛత, సరళత గల ఆత్మ, ముడుతలు పడి, కృశించినవారి జీర్ణదేహాలగుండా ప్రకాశిస్తూంది. చిన్న పిల్లలు శుద్ధ అమాయకులు, గాని ఈ పెద్దలకు గల అచంచల మూఢభక్తిమాత్రం వాళ్ళకులేదు. మానవుల ఆత్మలు ఒక దానితో ఒకటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొనేందుకు సాధనగా ఏదయినా ఒక అంతర్వ్యాహిని గాని వున్నట్లయితే, అప్పుడు నా హృదయపూర్వక ఆశీస్సులు వాళ్ళకు విధిగాచేరి, వుపయోగిస్తాయి.

షెలీదా

16-5-1893

సాయంకాలం స్నానం చేసుకున్నాక ఒక గంటసేపు నదిగట్టున నిర్మల మనస్సుతో వుత్సాహంగా నడిచేను. ఆ తరువాత క్రొత్తగా తెప్పించిన విహార పడవలోకి వెళ్ళి, ప్రవాహం మధ్యను లంగరువేసి, చెక్కలమీద ప్రక్క పరచుకొని సాంధ్య చీకట్లో వెల్లకిలా పడుకున్నాను. చిన్నవాడైన "ఎస్" నా ప్రక్కనే కూచుని ఏదో మాటాడుతున్నాడు. తారకామణులతో వినీలాకాశం నిండుగా అలంకరింపబడింది. ప్రతిరోజూ ఓ భావం నా మనసులో వదలకుండా మెదలుతూన్నది: అనంత తారకా విరాజితమైన ఈ వినీలాం

బరంక్రించన నేను తిరిగి జన్మిస్తానా? నిశ్శబ్దంగా నిండుగా ప్రవహించే ఈ వంగ నదిమీద, ఎంతో ఏకాంతంగావున్న యీ ప్రపంచ మారుమూలలలో, ఇటువంటి అద్భుత సాంధ్య సమయాలయొక్క ప్రశాంత అమందానందము తిరిగి నాకు సంప్రాప్తిస్తుందా ?

బహుశా ఆ యోగం కలగక పోవచ్చు. ప్రకృతి దృశ్యాలు మారిపోవచ్చు. నేను మరో రకమైన మనస్తత్వంతో జన్మించవచ్చు. ఇటువంటి సాయంసమయాలు అనేకం రావచ్చు. కాని అవి నన్ను ఇప్పటిమాదిరిగా ప్రేమతో లాలించి, ఆనందాన్ని యీయ నిరాకరించవచ్చు.

...నా కున్న మహాభయమల్లా నేను యూరపులో తిరిగి జన్మిస్తానేమో అని! ఈ విధంగా నడ్డివాల్చి మీదున్న అనంతాకాశాన్ని సావకాశంగా తిలకిస్తూ విశ్రమించటానికి అక్కడ వీలుండదు. పడుకున్నామంటే అక్కడ చీవాట్లు తగులుతాయని భయపడుతున్నాను. ఏదో ఒక ఫేక్టరీలోనో, బేంకీలోనో లేక పార్లమెంటులోనో బలవంతాన పనిచేయ వలసి వుంటుంది. అక్కడున్నరోడ్ల మాదిరిగానే మనిషి మనస్సుకూడా కఠినం చేసుకోవాలి. రాకపోకల ఒత్తిడికి తగిన విధంగా లెక్కలు కట్టి నిర్మించాలి. ఏ అడ్డు లేకుండా వుంచుతూ క్రమ పద్ధతిలో నడిపించాలి.

సోమరిగా వుంటూ, కలలుగంటూ, నాలో నేను లీనమైపోతూ, మనస్సులో ఎల్లప్పుడూ వినీలాకాశాన్ని నింపుకుంటూ వుండాలని నేను ఎందుకు అభిలషిస్తున్నానో సరిగా చెప్పలేను. ఈ చిన్ని పడవలో ఇలా పడుకునివున్నా, ప్రపం

చంలో క్షణకాలంకూడా తీరిక లేకుండా తిరిగి పనిచేసే వ్యక్తి
ని కు. నేను ఏ మాత్రం తీసిపోను. పైగా నడుం బిగించుకొని
కష్టపడి పని చేయటానికి గాని నేను లేచినట్లయితే, దేవదారు
పేడులా అతి బలహీనంగా కనపడి వుండేవాణ్ణి.

షెలీదా
3—7—1893

గతరాత్రి అంతా, దారితప్పిన కుక్కలా అరుస్తూ హోరుపెడుతూనే ఉందిగాలి. తెరపి లేకుండా వానకురుస్తూనే ఉంది. పొలాల్లోని వర్షపునీరు అసంఖ్యాకమైన ప్రవాహాలుగా మారి నదిలో కలియటానికి బిలబిలా పరుగులు పెడుతు న్నాయి. వర్షంలో తడిసి నీరు కారుతూన్న రైతులు, కొందరు వెదురుబద్దలతో అల్లిన చిన్నగొడుగులను నెత్తికి పెట్టుకొని, కొందరు పెండలం ఆకులను మీద ఉంచుకొని, పడవలో నదిని దాటివెళుతున్నారు. సరకులతో నిండిన పెద్దపెద్ద పడవలు మెల్లమెల్లగా బంగుకుమని పోతున్నాయి. చుక్కాన్ని దగ్గర కూచున్న పడవవాడు తడిసిపోతున్నాడు. పడవ కళాసీలు త్రాళ్ళను పట్టుకొని అంతవర్షంలోను శ్రమిస్తూ పడవను లాక్కెళుతున్నారు. పక్షులు విచారంతో గూళ్ళనుంచి కదల లేవు. కాని శ్రమజీవులు మాత్రం విశ్రాంతి అన్నది లేక పనిపాట్లు చేస్తూనే ఉన్నారు. వాతావరణం ఎలాగున్నా సరే లోకంలో పనిపాట్లు సాగుతూ ఉండాలికదా !

నా పడవకు సరిగా ముందర, ఇద్దరు గొల్లపిల్లలు ఆల మందలను మేపుతున్నారు. ఆ ఆవులు అతితొందరగా నోటికి

దొరికినది మేస్తున్నాయి. వాటి మూతులు పచ్చగడ్డిలో మునిగిఉన్నాయి. వాటితోకలు శరీరం మీద వాలుతూన్న ఈగలను తోలుకోవడంలో నిమగ్నమయి అటూఇటూ కదులుతున్నాయి. వర్షపు జల్లులు, గొల్లపిల్లల కర్రలు వదలకుండా అన్యాయంగా వాటి వట్టిమీద అలా పడుతూనే ఉన్నాయి. ఆరెంటిని మూకు మాటాడకుండా సహిస్తూనే మేతమేసుకు పోతున్నాయి. పాపం, ఈ గోవులకళ్ళల్లో సాధుత్వం, అమాయికత్వం, ఆప్యాయత, విచారం నిండిఉన్నాయి. మానవుని పనిపాటల భారాన్నంతా, నోరూ వాయీ లేని ఈ ఉత్కృష్ట సాధుజంతువులే భరించాలని దైవం ఎందుకు శాసించిందా అని నేను ఆశ్చర్యపడుతుంటాను.

ఈ నది రోజురోజుకీ పొంగుతూంది. పడవ డెక్ మీద నుంచి నిన్న ఏం చూడగలిగానో అదే ఈనాడు పడవలోపల గది కిటికీలోంచే చూడగలుగుతున్నాను. ప్రతిరోజూ నేను మేల్కొనేసరికి నాదృష్టి ప్రసరించే ప్రదేశం మరీమరీ పెరిగి పోతూంది. దూరానగల పల్లెప్రాంతాన ఉన్న వృక్షాగ్రాలు ముదురు ఆకుపచ్చ మేఘాల్లా కనుపించి ఎంతో కాలం అవనే లేదు. ఈనాడు ఆ అడివి యావత్తూ దృగ్గోచరం అవుతూంది.

సిగ్గు మొగ్గ తొడుగుతూన్న ఇద్దరు ప్రేమికుల్లా, పృథ్వీజలాలు, ఒకరి దరికి ఒకరు మెల్ల మెల్లగా వస్తున్నారు కలుసుకునేందుకు. వాళ్ళ సిగ్గుల సరిహద్దులు దగ్గరయ్యాయి. ఇద్దరూ ఒకరి బాహుబంధాల్లో ఒకరు ఇమిడిపోయేరు. హోరున కురుస్తూన్న వర్షాల్లో ఒడ్లనొరసి నిండుగా ప్రవహించే ఈ నదిలో పర్యటిస్తూ నేను ఆనందం పొందుతాను. వదలిపెట్టు

పడవను అన్న ఆజ్ఞ... ఎప్పుడు ఇద్దామాఅని తహతహలాడు తున్నాను.

షె. లీ దా

4—7—1896

ఈరోజు ఉదయాన సూర్యకాంతి కాస్త తొంగి చూసింది. వర్షాలు పడటంమాని నిన్ననే తెరపిఇచ్చాయి. కాని మేఘాలు ఆకాశపుటంచుల్లో దట్టంగా పేరుకొనే వున్నాయి. అందుచేత వర్షాలు పడటం ఇంతటితో ఆగిపోయి నట్లే అని అనుకోటానికి ఏమాత్రం అవకాశం లేదు. మహా బరువైన మబ్బుల తివాచీని చుట్టి ఒక ప్రక్కను ఉంచినట్లుగా ఉంది. ఝంఝామారుతం ఏక్షణంలోనయినా వచ్చి, ఆచుట్టను విప్పి తిరిగి అంతటాపరచి, ఆకాశంయొక్క నైలిమను, బంగరు సూర్యకాంతిని కనబడకుండా చేస్తుంది.

ఈసంవత్సరం ఆకాశంలో ఎంతనీరు నిలవచేయబడింది. అప్పుడే నదిపొంగి క్రిందనున్న పల్లపుపొలాల మీదకు వచ్చేసింది. పైర్లనన్నీ ముంచివేస్తుందేమో నన్న భయంకలుగచేస్తోంది. నిరాశానిస్పృహలు ఆవరించినఆదౌర్భాగ్యపు రైతులు. సగం సగం పండిన వరికంకుల్ని తొందరగా కోసుకొని, పడవల్లో వేసుకొని తీసుకుపోతున్నారు. తమ దురదృష్టానికి చింతిస్తూ గొల్లుమని ఏడుస్తున్న వాళ్ళ మొరలు, నా పడవప్రక్కనుంచి వారి పడవలు వెళుతూం డగా చెవినిపడ్డాయి. పంటముఖం పట్టడానికి సిద్ధంగా ఉన్న తరుణంలో వరిచేలను కోయడం అంటే రైతుకు ఎంత గుండె

కోతగా ఉంటుందో సులువుగా ఊహించవచ్చు. కోసిన కంకుల్లో కొన్ని గింజలయినా గట్టిపడి కొంతలోకొంత ధాన్యం రాలవచ్చునన్న ఆశాకిరణం మిణుకు మిణుకుమంటూ వాళ్ళని అలా నిలబెడుతున్నది.

కర్మఫలాలను పంచడంలో ఈశ్వరునికి కొంత కనికరము వుండితీరాలి. అలాకాకపోతే, మన భాగాన్ని మనం ఎలా పొందకలుగుతున్నాం? అది ఎందులోంచి వస్తున్నదో చూడటం చాలా కష్టం. ఎవరినీ నొప్పించని లక్షలాది ఈ అమాయక జీవుల ఆర్తనాదాలు బయటకు ఎక్కడికీ వినిపించి నట్లు లేదు, వారి గోడు వింటూ వర్షం కన్నీరు అవిరళంగా కారుస్తూన్నది. నది ఇంకా ఇంకా పొంగిపోతోంది. ఎంత మొరపెట్టుకున్నా నిరుపయోగంగా వుంది. సహాయసంపత్తి, ఏమూలనుంచీ రాలేదు. వాళ్ళ బాధలను తీర్చే వారెవరూ ఉన్నట్లు కనబడలేదు. ఇదంతా దైవశాసనం అనుకుంటూ ఎవరిమట్టుకు వాళ్లు ఓదార్చుకోడం తప్ప రెండో గత్యంతరం లేకపోతోంది. లోకంలో దయా ధర్మాలనేవి ఇంకా వున్నా యన్న సంగతి మానవుడు తెలుసుకోవడం అత్యంతావసరం.

ఇదంతా కేవలం చేతకానితనమే తప్ప అన్యం కాదు. ఆగ్రహావేశంతో నోరుమూసుకుని చేతులు కట్టుకొని నిస్స హాయంగా కూర్చోవటమే అవుతూన్నది. తార్కిక దృష్ట్యా చూస్తే సృష్టిలో పరిపూర్ణ సుఖం అన్నది లేదు. అవి అసం పూర్తిగా ఉన్నంతకాలం, అజ్ఞానంతోనూ, దుఃఖంతోనూ అలమటిస్తూ వుండాల్సిందే. పరిపూర్ణత సిద్ధించాలంటే సృష్టికి అతీతమవ్వాలి. అదే భగవంతుడు! మన ప్రార్థనలు అంత

దూరం సాహసించి వెళ్ళగలవా? దాన్నిగురించి ఆలోచిస్తున్నకొద్దీ, మొదటికే తిరిగి రావటం జరుగుతుంది. అసలు ఈ సృష్టిఅనేదే ఎందుకు? అసలు ఈ సృష్టే మాకొద్దని అభ్యంతరం తెలియచేయటానికి మనస్సులను దృఢం చేసుకోలేనప్పుడు, సృష్టి స్నేహితురాలైన దుఃఖాన్నిగూర్చి ఫిర్యాదులుచేసి మొరలుపెట్టుకోవడం నిష్ఫలం.

షాజెద్‌పూర్
7-7-1893

గ్రామీణజీవిత ప్రవాహం మహావేగంతో పరుగు లెత్తదు. అలా ఒకేచోటనిలచి ఉండనూ ఉండదు. పని, విశ్రాంతి చెట్టాపట్టాలు వేసుకొని జంటల్లా వెళుతూంటాయి. నదిని దాటిస్తున్న తెప్ప అటూ ఇటూ తిరుగుతూన్నది. పడవను లాక్కునివెళ్ళే కాలిబాట వెంబడే గొడుగులు వేసుకుని కొందరు దారిపోయేవాళ్లు పోతున్నారు. వెదురు బుట్టల్లో బియ్యాన్ని నీళ్ళలో కడుగుతున్నారు కొందరు స్త్రీలు. రైతులు జనపనార కట్టలు నెత్తిన పెట్టుకుని అమ్ముకునేందుకు సంతకు వెళుతున్నారు. ఓ కర్రదుంగను ఇద్దరువ్యక్తులు క్రమబద్ధంగా, చెవులు గింగుర్లు పట్టేటట్లు, గొడ్డళ్ళతో కొడుతూ పేళ్లుక్రింద చీలిస్తున్నారు. అశ్వత్థ వృక్షరాజం క్రింద బోర్లాపడివున్న ఒక డింగీని గ్రామ వడ్రంగి బాగుచేస్తున్నాడు. ఊరకుక్క ఒకటి పనీపాటూ లేకుండా కాలవగట్టుమీద పిచ్చెక్కినట్లు తిరుగుతూంది. పసందైన పచ్చగడ్డిని పుష్కలంగా మేసిన గోవులుకొన్ని అక్కడ పడుకుని నెమరువేస్తూ,

తీరిగ్గా చెవులు ఆడిస్తూ, శరీరంమీద వాలుతూన్న ఈగలను తోకలతో తోలుకుంటున్నాయి. నెత్తిమీద వ్రాలి మితిమీరిన స్వేచ్ఛతో ప్రవరిస్తున్న కాకులను మందలించటానికై చిరాగ్గా ఉండుండి తలలు విసరుతున్నాయి. ఆ ఆవులు.

విసుగు పుట్టిస్తున్న గొడ్డలి చప్పుళ్లు, వడ్రంగి బాడిద ధ్వనులు, పడవ తెడ్ల శబ్దాలు, నగ్నంగాఉండి ఆడుకుంటూన్న పిల్లల హర్షధ్వానాలు, రైతుపాటల్లోని విషాదస్వరం, అన్నిటినీ మించిన నూనెమిల్లులోని గానుగల కిర్రుధ్వనులు - ఇవన్నీ ఆకుల గలగలా రావాలతోనూ, పక్షుల కిలకిలా రావాలతోను కలసిమెలసినయి, కాని విభిన్నత్వం శృతిగోచరం కాలేదు. ఈ ధ్వనులన్నీ కలసి, ఒకానొక స్వాప్నిక జంత్ర సమ్మేళనంనుంచి ఉచ్ఛలించి హృదయాన్ని కదిలిస్తూన్న అద్భుత స్వరలహరిలా ఉంది.

షాజెద్‌పూర్
10—7—1893

"మూనకవులు" మీద జరుగుతూన్న చర్చగురించి నే చెప్పేదల్లా ఒకటే. మూనకవులకయినా, మాటాడేకవులకయినా అనుభూతియొక్క శక్తి సమానమే అయినప్పటికీ, కవిత్వానికి దానికీ ఏమీ సంబంధం లేదు. కవిత్వం అంటే అనుభూతి కాదు. భావానికి ఆకృతిని సృష్టించటమే కవిత్వం.

కవిలో అంతర్గతమై, నిగూఢమైఉన్న సునిశిత నైపుణ్యం వలన, భావనలు రూపాన్ని ధరిస్తాయి. సృజనాశక్తే కవిత్వానికి మూలం. అనుభూతులు, భావనలు, భాష ఇవన్నీ కేవలం

ముడిసరుకులు మాత్రమే. ఒకనికి భావసంపద ఉండవచ్చు. రెండోవానికి భాషా వైదుష్యం ఉండవచ్చు. మూడోవానికి పై రెండుకూడా ఉండవచ్చు. కాని ఎవనికయితే సృజనాత్మక శక్తి, - ప్రతిభావ్యుత్పత్తులు - ఉంటాయో అతడొక్కడే నిజమయిన కవి.

పాటిసార్,
13—8—1893

* ఈ బీలులగుండా ప్రయాణంచేసి కాలీగ్రాం వచ్చేసరికి ఒక భావన మనస్సులో రూపొందింది. ఆ ఆలోచన క్రొత్తదికాదు గాని పాత భావనలే నూతనశక్తితో ఉద్భూతమవుతూవుంటాయి.

---

* బీలు:- వంగదేశంలో ప్రవాహాలు చదునునేలలో ప్రవహిస్తూ ప్రవహిస్తూ పల్లపునేల తగలగానే అక్కడ బాగా విస్తరించుకుని పెద్ద జలాశయంలా రూపొంది బీలు అనే పేరుతో పిలవబడుతుంది. వీటి విస్తీర్ణానికి ఒక మేర అంటూ ఉండదు. వేసవిలో చిన్న మడుగులావుండి, వర్షాకాలంలో మహా సముద్రంలా కనబడుతాయి ఈ బీలులు. ఎత్తయిన మట్టిదిబ్బలమీద కట్టుకున్న పూరిగుడిసెలతో చిన్న చిన్న పల్లెలు ఆ బీలుల్లో చిన్న దీవుల్లా అచ్చటచ్చట అగుపిస్తాయి. ఒక పల్లెనుంచి వేరొక పల్లెకు వెళ్ళటానికి పడవలుగాని, గుండ్రటి కుండలతో నిర్మించిన తెప్పలుగాని శరణ్యాలు.

గట్లచేత తీర్చి దిద్దబడకపోతే నీరు తన అందాన్ని నష్టపోయి, ఎటుబడితే అటు విశృంఖలంగా సర్వత్రా వ్యాపించి, విసుగు కలిగిస్తుంది. భాషవిషయంలో గట్లమాదిరిగా పనిచేసి, దానికి ఒక విశిష్టస్వరూపాన్ని, యోగ్య స్వభావాన్ని సౌందర్యాన్ని సమకూర్చేది ఛందస్సు. గట్లు, నదికి ప్రత్యేక మూర్తిత్వాన్ని ఇచ్చినట్లుగానే, ఛందస్సు ప్రతిపద్యాన్ని ఒక విశిష్టసృష్టిగ రూపొందిస్తుంది. గద్యం రూపురేఖలుగాని, వ్యక్తిత్వంగాని లేని బీలువంటిది. నదీజలాలకు చలనం, ముందుకు సాగిపోవటం అనేవి వున్నాయి. కాని బీలులో జలం మాత్రం ఆవిధంగా నియమబద్ధంగా ప్రవహిస్తూపోక, అక్కడకక్కడే అంతటా విస్తరించి దేశాన్ని ముంచివేస్తుంది. అందుచేత భాషకు శక్తి సమకూర్చాలంటే, ఛందోబద్ధం చేయటం అవసరం. అలా కాకపోతే, అది ఎటుపడితే అటు

---

ఎక్కడయితే పంటభూములను నీరు ముంచివేసిందో, అక్కడ వరిచేను అంతలోతు నీళ్ళలోనుంచీ పెరుగుతుని మీదకు వస్తూంటుంది. మీదకు వచ్చిన ఆ వరిచేలనుంచి ప్రయాణం చేస్తున్న పడవలు, బంగురుకు వెళుతూన్నట్లుగా అందంగా కనుపిస్తాయి. అక్కడ నీరు స్ఫటికంగా స్వచ్ఛంగా ఉంటుంది కొన్నిచోట్ల ఈ బీలులు నీటి కలువలతోను, వివిధ రకాల జలపక్షులతోనూ చిత్రంగా ఉంటాయి. ఇవన్నీ చూస్తే ఈ బీలులను చిత్తడినేలలని గాని, లేక సరస్సు అని గాని అన వీలుండదు. అవి స్వకీయస్వరూప స్వభావాలతో విలసిల్లుతూ తమ ప్రత్యేకతను వ్యక్తం చేస్తుంటాయి.

అడ్డూ ఆపూ లేకుండా విస్తరించటంతప్ప, ముందుకు ప్రవహిస్తూ పోజాలదు.

వంగీయులు ఈబీలులను మూగజలాలు అని పిలుస్తారు. వాటికి ఒక భాషనిగాని, భావవ్యక్తీకరణనిగాని లేవు. కాని నది అలాకాదు. అది నిరంతరం గలగలారావం చేస్తూనే వుంటుంది. అదేవిధంగా పద్యంలోని మాటలు కూడా పాడుతాయి. అవి "మూగపదాలు" మాత్రం కావు. ఛందస్సే రూపసౌందర్యాన్ని, గమన సౌందర్యాన్ని రమణీయ సంగీతాన్ని సృజిస్తుంది. కట్టుబాట్లవల్ల కేవలం సౌందర్యమే కాక శక్తి కూడ సమకూరుతుంది.

కవిత ఛందస్సు అధికారానికి లోబడిపోయిందంటే గ్రుడ్డిసాంప్రదాయాల వెంటబడి కాదు. ఆ చంధస్సు నడకలో ఒక విధమయిన అపూర్వానందాన్ని చవిచూసే, దానిచే ఆకర్షింపబడింది. తెలివితక్కువవారు కొందరు ఛందస్సును ఒక విధమయిన శబ్దాల సాము గరడీయో లేక ఇంద్రజాల మహేంద్రజాలమో అని, దాని వుద్దేశం ప్రజాబాహుళ్యపు మెప్పును చూరగొనటము మాత్రమే అని ఊహిస్తున్నారు. కాని అది సరయినదికాదు. సౌందర్యం వలెనే, ఛందస్సు కూడా విశ్వోద్భవమే. హృద్దులలో ప్రవహింపచేసిన ఛందోబద్ధమైన పద్యకవిత మానవుల మనస్సులను అపరిమితంగా కదిలించ శక్తివంతమై వుంటుంది. గద్యానికి మాత్రం అది దుస్సాధ్యం.

ఈ నా భావన, నదిలోంచి బీలులోకి, బీలులోంచి నదిలోకి పయనించి వచ్చేసరికి తేటతెల్లమయింది.

పాటీసార్,
26—8—1893

పురుషుడు మొరటుగాను, స్త్రీ నగిషీగాను తయారు చేయబడ్డ వస్తువని నేను అనుకుంటూవుండేవాణ్ని. స్త్రీ యొక్క అలవాట్లలో ప్రవర్తనలో, మాటతీరులో, అలంకరణలో ఎక్కడా తెగని సమైక్యత, పొందికవుంది. దానికి కారణం ఇది యుగయుగాలనుంచీ, ప్రకృతి ఆమెకు ఒకే ఒక విధమైన నిర్దిష్టపాత్రను ఒసగి తదనుగుణంగా ఆమెను తీర్చిదిద్దితూన్నది. ఏ ప్రళయంగాని, ఏ రాజకీయ విప్లవంగాని, ఏ సాంఘిక సిద్ధాంతాల మార్పుగాని, ఇప్పటివరకు స్త్రీని, ఆమె నిర్దిష్ట బాధ్యతలనుంచి నిర్వహించవలసిన పనులనుండిగాని మరలించడంగాని, ఆమె పనులలో గల పరస్పర సంబంధ బాంధవ్యాలను రూపుమాపడంగాని చేయలేకపోయింది. ఆమె ప్రేమిస్తోంది. బిడ్డలను కని పెంచుతోంది. లాలిస్తోంది. అంతకుతప్ప మరేం చేయలేదు. ఈ పనులలో ఆమె గడించిన సునిశిత నైపుణ్యం ఆమె అంగప్రత్యంగాల్లోనూ, చేతల్లోనూ సర్వత్రా వ్యక్తమౌతూంటుంది. పూవునుండి పరిమళమును విడదీయజాలనట్లు, ఆమె స్వభావ చేష్టలు వేరువేరుగాక ఒకటిగానే వున్నాయి. అందుచేతనే ఆమెకు అనుమానాలు గాని, జంకులు గాని లేవు.

కాని పురుషస్వభావంలో మాత్రం చాలా ఎత్తుపల్లాలు ఇంకా ఉంటూనే ఉన్నాయి. అతని వ్యక్తిత్వాన్ని మలచటానికి సహకరించిన పరిస్థితులు, శక్తులు వాటి జాడ

ముద్రలను చెరగకుండా అతని మీద విడచిపెట్టాయి. ఆ కారణం వల్లనే ఆ ముఖ్యమైన ఖురులు ఒకనికి తీరూ తెన్నూ లేని విశాలమయిన నుదుటిలోనూ, మరొకనికి బాధ్యతారహితంగా ముందుకు వచ్చిన ముక్కుమీదా, మూడో వ్యక్తికి చెప్పనలవికానంత కఠినత్వము దవడలయందు వెల్లడి అవుతూంటాయి.

అవిచ్ఛిన్నత, ఏకరీతిగా ఉండటం అనే వాటివలన ప్రయోజనాలు మానవునికి ఉన్నట్లయితే, ప్రకృతి 'ఎక్కువ శ్రమపడకుండగనే, అతనికి అనువైన నిర్దిష్టఆకార నిర్మాణాన్ని సాధించి సరళంగానూ, సహజంగానూ అతను పనిపాటులు చేసుకొనేందుకు వీలుకల్పించి ఉండేది. అతడుకూడా ప్రవర్తనా నిబంధనలను అంత క్లిష్టం చేసి ఉండేవాడు కాదు. బాహ్యా శక్తుల ఒత్తిడివలన కలత పెట్టబడినప్పటికీ, అతను తన సహజ స్థితిని వదలి పెడమార్గాన్ని పట్టడానికి అవకాశం తక్కువ ఉండేది.

స్త్రీ మాతృత్వానికి అనువయిన రూపంతో సృష్టింపబడ్డది. పురుషునికి అటువంటి వేవీ లేవు. అందుచేతనే పరిపూర్ణ సౌందర్యంలో అతను ఆమెతో సరిసమాన స్థాయికి చేరుకోలేక పోతున్నాడు.

పటీసార్,

1?–2–1894

మాకు రెండు ఏనుగులు ఉన్నాయి. అవి ఈ నదీ తీరానికి మేతకోసం వస్తూంటాయి. వాటిని చూస్తే నా

కెంతో సంతోషంగా వుంటుంది. అవి ఒక పాదంతో నేలను మెల్లగా కొట్టి, తొండం చివరితో గడ్డిని పట్టుకొని, మీదకు లాగుతాయి. ఆ లాగటంలో పెద్దపెద్ద పెళ్లలు బయటికి ఊడి పడతాయి. ఆ పెళ్లలలో కేవలం పచ్చగడ్డేకాక, ఏవేవో వేళ్ళూ, మట్టి ఇంకా అనేకమైనవి కూడా వుంటాయి. ఆ తరువాత ఆ ఏనుగులు పచ్చగడ్డి నుంచి మట్టి అంతా రాలి పోయే పర్యంతం, ఆ పెళ్లలను తొండాలతో పట్టుకొని అటూ ఇటూ ఊపుతూనే వుంటాయి. ఆ విధంగా గడ్డిని పరిశుభ్ర పరచుకొని తింటాయి. అప్పటప్పటి మట్టిని తొండాలలోకి తీసు కోవాలని వాటికి ఇచ్ఛకలుగుతూంటుంది. వెంటనే మట్టిని తీసుకొని, ఘీంకరిస్తూ శరీరాలనిండా పౌడరుకుమల్లే సంతో షంతో జల్లుకుంటాయి. ఏనుగులు చేసుకునే ముస్తాబు ఇదే!

స్థూలకాయాలతో, అపరిమితమైన బలసంపదతో, వికార రూపురేఖలతో, అపకారం చేయక వినమ్రంగా వుండే కొండల్లాంటి ఈ జంతువులను చూడటం అంటే నా కెంతో ప్రీతి. వాటి పరిమాణం, వాటి గజిబిజితనం చూస్తేనే, వాటి యందు నాకు ఒకవిధమైన జాలికలుగుతుంది. కొండల్లా ఉండి కదల్చ అశక్యంగా ఉన్న వాటి శరీర పరిమాణం చూస్తే, శైశవం వాటిలో గోచరిస్తుంది. వాటికి విశాల హృదయాలు ఉన్నాయి. కోపం వచ్చినప్పుడు మాత్రం వాటిని పట్టశక్యం కాదు. కాని ఆగ్రహం చల్లారేక వాటిని చూస్తే మూర్తీభ వించిన శాంతిదేవతల్లా ఉంటాయి. వాటి స్థూలకాయంలో ఉండే అందవికారం, అసహ్యం కలుగచేయటానికి బదులు ఆకర్షిస్తూంటుంది.

పాటీసార్,
27-2-1894

ఆకాశంలో ఒక్కొక్కసారి మేఘాలు బాగా క్రమ్ముకుంటున్నాయి. మళ్ళా కొంతసేపటికి మబ్బులు విడిపోయి నిర్మలంగా ఉంటూంది. హఠాత్తుగా వీచేగాలికి, పడవ తీరిగ్గా కిర్రుకిర్రుమని అరుస్తోంది. ఈ విధంగా ఆ రోజంతా గడచి పోయింది

ఇప్పుడు ఒంటిగంట దాటింది. ఈ పల్లెప్రాంతం మిట్ట మధ్యాహ్నంలో నిమగ్నమయి పోయింది. బాతులు అరుస్తు న్నాయి. నదిలో పయనిస్తూన్న పడవలు తెడ్లు చప్పుళ్లు చేస్తు న్నాయి. బట్టలు ఉతుకుతూ నీట్లో ఉప్పళ్ళిస్తున్నారు కొందరు. రేవులోంచి పశువులను తోలుకెళుతూన్న వారి కేకలు వినబడు తున్నాయి. ఈ విధమయిన రకరకాల ధ్వనులతో నిండిన ఈ ప్రదేశంలో మైమరచి ఉన్ననాకు కలకత్తా నగరం యొక్క నిరుత్సాహమయిన యాంత్రిక జీవితాన్ని, కుర్చీని, టేబిలును ఊహించుకోవడం కూడ కష్టంగా ఉన్నది.

ప్రభుత్వ కార్యాలాయాలు ఎంత ఆవశ్యకమో కల కత్తా నగరంకూడా అంత ఆవశ్యకమైనది; అతిముఖ్యమైనది, టంకసాల నుండి ఏరోజు కారోజు వెలువడిన నాణెంలా, చక్కగా తయారయి, మెరుస్తూంటుంది. అబ్బ! శుష్కమై, భయంకరమై విసుగుపుట్టి, పీసం వాసం తేడాలేకుండా. తూకానికి సరిగా సరిపోతూ, గౌరవప్రదంగా ఉండే ఆరోజులు ఎటువంటి రోజులు!

ఇక్కడ నాకు ఎవరి అజమాయిషీ లేదు. నా జీవితం కీ ఇచ్చిన యంత్రంలా లేదు ఇప్పుడు. ప్రతిరోజు నా స్వంత మయిన దానిలా ఉంది విశ్రాంతిగా ఆలోచనలు సాగిస్తూ, దేశకాలాల శృంఖలాలచే బంధింప బడక, పంటపొలాల్లో ఉత్సాహంతో విహరిస్తూంటాను. తలవంచుకొని నేను ఇంకా తిరుగుతూండగానే, సాంధ్య చీకట్లు భూమిమీద, ఆకాశం మీద, నీటిమీద వ్యాపించసాగేయి.

పాటీసార్,
22-3-1894

నేను పడవ కిటికీ దగ్గర కూచుని నదిమీదికి దృష్టి పోనిచ్చేను. నీటిమీదనుంచి హఠాత్తుగా ఓ పక్షి రివ్వున ఎగిరి పోతూండడం నా కంటబడింది. ఆ పక్షి వెంబడే కొంతమంది పరుగులు పెట్టడం, కేకలు వేయడం నేను గమనించేను. అది ఎంపుడు నీటికోడి అని తనకు రాబోయే ఆపదనుంచి తప్పించు కునేందుకు వంటగదిలోంచి బయటకు వచ్చి, పడవమీంచి రివ్వున ఎగిరి ఆవలి ఒడ్డుకు చేరుకుందామని తన యావచ్ఛక్తినీ వినియోగిస్తోందని తెలుసుకున్నాను. దాన్ని వదలకుండా వెంబడించిన మనుష్యులు ఎలాగయితేనేం దాన్ని పట్టుకో గలిగారు. మెడకాయను పట్టుకొని, జయజయ ధ్వానాలు చేసుకుంటూ దానిని తీసుకువచ్చారు. భోజనంలో ఈరోజు నాకు మాంసం మాత్రం వద్దని వంట వానితో చెప్పేసాను.

మాంసాహారాన్ని విడచిపెట్టాలని నేను నిజంగా నిశ్చ యానికి వచ్చేను. మాంసాన్ని భుజించ గలుగుతున్నామంటే,

దానిలోని క్రూరత్వాన్ని, పాపాన్ని ఆలోచించకపోవడం చేతనే. లోకంలో అనేకమైన హత్యలు ఉన్నాయి. అవన్నీ మానవుని చేతనే సృజింపబడ్డాయి. అలవాట్లు, ఆచారాలు, సాంప్రదాయాలు అనే ముసుగులో ఆ హత్యాదోషాలను కప్పిపుచ్చుతున్నాం. జంతుహింస వీట్లలోకి రాదు. అది ప్రధానంగా ఒక పాపం. ఇది నిర్వివాదాంశం. మన హృదయాలను కఠినం చేసుకోకుండా, నిర్లక్ష్యంగా ఉండకుండా ఉన్నట్లయితే, హింసించవద్దు అని అవి పెట్టే ఆక్రందనలు మనకు సుస్పష్టంగా వినబడతాయి. కాని, హింసాకాండను అతి సులువుగాను, ఎంతో సంతోషంగానూ మనం జరుపుతూనే ఉన్నాం. ఈ హింసాచర్యలలో మనతో కలియకుండా ఎవడయినా దూరంగా ఉన్నట్లయితే వాణ్ణి ఓ వెర్రివాడిక్రింద జమకట్టి ఎగతాళి చేస్తున్నాం.

పాపం అంటే మనకు గల అభిప్రాయం ఎంత అసహజంగా ఉంది! జీవకారుణ్యామే ధర్మాలన్నిటిలోనూ అత్యుత్కృష్టమైన ధర్మం అని నా అభిప్రాయం. ప్రేమ తత్వమే అన్ని మతాలకు పునాది. ఆ మధ్య ఏదో ఇంగ్లీషు పత్రికలో ఒక వార్త చదివేను. ఆఫ్రికాలో ఒకానొక సైనికస్థావరానికి యాభై వేల పౌనుల విలువగల జంతు కళేబరాలను పంపినట్లు, అక్కడకు చేరేక ఆ మాంసం అంతా చెడిపోయినట్లు, అందుచేత ఆ సరకు అంతా త్రిప్పి పంపబడిందని, దాన్ని చివరకు పోర్టుసమౌత్‌లో వేలం వేసి కొద్ది పౌన్లుకు మాత్రమే అమ్మివేసారని ఆ పత్రికలో ప్రచురించేరు. ప్రాణికోటి జీవితాలు, ఎంతఘోరంగా దుర్వ్యయం చేయబడ్డాయి! జీవిత విలువలను

ఏమాత్రం పరిగణించకుండా ఎంత కఠినంగా ప్రవర్తిస్తున్నారు! విందుభోజనాలలో విస్తళ్ళు నింపటానికి ఎన్ని నిండు ప్రాణాలు బలి అయిపోతున్నాయి! ఆ తయారయిన మాంసంలో ఎంత అధికభాగం ముట్టబడకుండానే పెంటపాలయి పోతూంది!

మనం చేస్తూన్న జంతుహింస, దోషమని తెలియకుండా చేసినంత కాలం, మనం నిందాపాత్రులం కాకపోవచ్చు. కాని అది మహాపాపమని తెలిసి, హృదయంలో జాలి పొంగేక కూడా,- ప్రాణి హింసా పరులతో కలియటానికై, మన భావాల కుత్తుకులను నులిమి వేయడం మానకపోవడం, మనలో ఉన్న మానవత్వాన్ని, మంచితనాన్ని ఘోరంగా పరాభవించినట్లే అవుతుంది. ఇటుపైని శాఖాహారాన్నే తిన టానికి నిశ్చయించుకున్నాను.

పాటీసార్
28-3-1894

ఇక్కడ అప్పుడే ఎండవేడిమి ఎక్కువగా ఉంటూంది. కాని ఈ ఎండలను నేను లక్ష్యంచేయలేదు. వేడిగాలి ఈలలు వేసుకుంటూ పోతోంది. అక్కడక్కడ సుడి తిరుగుతూ, మట్టినీ, ఇసుకనూ, ఎండాకులనూ పుల్లలనూ రివ్వున మీదికి లేవదీసి, నాట్యం చేస్తూ పరుగులు పెడుతూ వెళ్ళిపోతోంది.

ఈ రోజు ఉదయాన మాత్రం చల్లగా ఉంది. రమా రమి శీతాకాలంలో ఉన్నట్లు మాదిరిగానే ఉంది. నాకు స్నానం చేయ కుతూహలం కలుగలేదు. ఈ ప్రకృతిలో నిజానికి ఏం జరుగుతూందో చెప్పడం కష్టం. ఎవరికీ తెలియని

ఏ మార్పుమూలానో, ఏ స్వల్పాతి స్వల్పమైన కారణం వల్లనో, హఠాత్తుగా అంతా తారుమారవడం జరుగుతూంటుంది.

బాహ్య ప్రకృతి మాదిరిగానే మానవుని మనస్సుకూడా చిత్రవిచిత్రంగా పనిచేస్తుంటుందని నిన్న నాకు అవగత మయింది. నా శిరలలోనూ, ధమన్యల్లోనూ, నరములలోనూ, మజ్జలోనూ, మెదడులోనూ, పసిడి విద్య పనిచేస్తున్నది. రక్త ప్రవాహం ఉరకలు వేస్తూ పోతోంది. నాడీమండలం అతి చురుకుగా పనిచేస్తోంది. హృదయకండరం లేస్తూ పడుతోంది. మానవుని ప్రకృతిలో గల ఋతుస్వభావాలు ఒకదాని తరు వాత ఒకటి మారుతూంటాయి. ఇట్టున్పైని ఏ నిముషంలో ఏ రకమయిన గాలి, ఎక్కడనుంచి వీస్తుందో, ఎవరికీ తెలియదు గదా !

ఏదో ఒకనాడు నా జీవితంలో మార్పువచ్చి, అఖండ వైభవంతో విలసిల్లుతానన్న నమ్మకం నాకు బాగా ఉంది. ఆటంకంగా ఉన్న సమస్త లౌకిక దుఃఖాలను, కష్టాలను దాటుకొని ముందుకు పోగల శక్తి సామర్థ్యాలు నాకుఉన్నట్లు అనిపించింది. నా శేష జీవిత కార్యక్రమ పట్టిక అచ్చువేయిం చుకొని, మడచి, జేబులో ఉంచుకొన్న వ్యక్తిలా హాయిగా ఉన్నాను. ఆ మర్నాడే, భరింపరాని దుర్వాయువు గుప్పున బయటికి రాగానే, భయాందోళనలు చుట్టుముట్టి, ఈ తుఫా నుకు నా శరీర నావ తట్టుకొని నిలబడగలదా అన్న సందేహం అంకురించింది. ఏ రక్తకణంలోనో, ఏ నరంలోనో. ఏదో అనా రోగ్యం చేరిందని, నా ధైర్యశక్తి, నా తెలివితేటలూ నన్ను నిలువునా క్రుంగదీసి పడగొట్టేటట్లుగా కనుపించేయి.

నా అంతర్యంలో గల ఇంద్రజాలం నన్ను భయపెడు తోంది. నా కర్తవ్యాకర్తవ్యాలను గూర్చి నోరు మెదపటానికి గూడా ధైర్యం లేకుండా చేస్తున్నది. ఈ మాయ నాకెందుకు జతచేయబడిందో తెలియటంలేదు. బ్రహ్మాండమయిన ఈ మాయను నేను అర్థం చేసుకోలేక పోతున్నాను. అదుపులో నయినా ఉంచలేకపోతున్నాను. అది నన్నెక్కడికి ఈడ్చుకు పోతుందో తెలియదు. లేక నేనే దాన్ని ఈడ్చుకు వెళతానో తెలియదు. ఏం జరుగుతూన్నదో నేను చూడలేకపోతున్నాను. ఏం జరుగుతుందని నన్నెవరూ సలహా అడగటం లేదు. అయినప్పటికీ యజమానిలా డాంబికంగా కనుపించి, అన్నిటికీ కర్తలా నటన చేయాలి.

లోన క్లిష్టమైన యంత్రాంగం కల సజీవమైన పియానోలా నేను ఉన్నాను. కాని నన్ను వాయిస్తున్న వ్యక్తి ఎవరో మాత్రం చెప్పలేకపోతున్నాను. ఆ వ్యక్తి ఎందుకు వాయిస్తున్నదీ మాత్రం ఊహించగలుగుతున్నాను. ఏ పాట వాయిస్తున్నదీ దాని రాగమేమిటో అది సంతోషాన్వితమో, దుఃఖ సమన్వితమో, స్వరములు మధురంగా వున్నయో, కటువుగా వున్నయో, రాగము సకాలమో, అకాలమో, తారస్థాయో, మంద్రస్థాయో మాత్రం నాకు తెలుసు. కాని అంతవరకయినా నాకు నిజంగా తెలుసా?

పాటీసార్,

30—3—1894

జీవిత యాత్ర సుదీర్ఘమని, ఎదుర్కోవలసిన దుఃఖాలు అసంఖ్యాకమనీ, అనుభవించకతప్పనివనీ, గ్రహించలేక నా

మనో ధైర్యాన్ని నిలబెట్టుకోటానికై బ్రహ్మప్రయత్నం చేయ వలసి వచ్చింది. కొన్ని సాయంసమయాల్లో, ఒంటరిగా కూచుని, టేబులుమీదున్న లాంతరు వెలుగును చూస్తూ, ధైర్యవంతుడిలా నిశ్చలంగా, మౌనంగా, ఏ ఫిర్యాదులు చేసికీ చేయకుండా, జీవిస్తానని శపథం చేసేను. ఆ నిశ్చయం నన్ను బాగా ఉబ్బించివేసింది. ఆ క్షణంలోమాత్రం నేను నిజంగా చాలాచాలా ధైర్యశాలినని భ్రమించేను. కాని రోడ్డుమీదున్న ముళ్ళు నా పాదాలను బాధించడం ప్రారంభించగానే, నేను నా ధైర్యానికి సిగ్గుపడి చుట్టుకుపోయాను.

భవిష్యత్తు గురించి అనేక తీవ్ర సంశయాలు కలిగేయి. జీవిత బాట మళ్ళా సుదీర్ఘంగా కనుపించింది. నా శక్తి ఎందుకూ చాలనట్లుగా అగపడింది.

ఈ చివరి అభిప్రాయాలు మాత్రం నిజమయినవి కావు. ఏమంటే ఈ చిన్న కంటకాలను భరించటమే ఎటువంటి వారి కయినా మహాకష్టం. మనో సంసారం మహా పొదుపైనది. అవసరం ఎంత ఉంటే అంతమట్టుకే వెచ్చిస్తుంది. అల్ప విష యాలమీద దుబారా ఖర్చుపెట్టదు. అది తన శక్తి సంపదను, లోభివానిలా ఎంతో జాగ్రత్తగా కూడబెట్టి, నిజమయిన విప త్తులు సంభవించిననాడు ఎదుర్కోవటానికి ఉపయోగిస్తుంది. చిన్నచిన్న వాటికి ఎంత ఏడ్చి నెత్తికొట్టుకున్నా ఎంత ప్రయ త్నించినా నిరుపయోగంగానే వుంటుంది. అవి కరుణను రేకెత్తించ సమర్థాలు కావు. దుఃఖ తీవ్రత గాఢమైనప్పుడు, ప్రయత్నమన్నదే అనవసరము. బాహ్యాపార చిట్లి, జాలితో కూడుకున్న ఊరడింపులు పెల్లుబుకుతాయి. సహానశక్తి,

ధైర్యశక్తి, ఒకదానికొకటి తోడై, వాటి ధర్మనిర్వహణకు అవి పూనుకుంటాయి. ఆ విధంగా, మహా దుఃఖం, మహా ఓర్మినికూడా తనతో తీసుకువస్తుంది.

మానవ ప్రకృతిలో ఒక భాగం ఆనందాన్ని కోరుతూం టుంది. రెండో భాగం త్యాగం చేయాలని కాంక్షిస్తుంటుంది. మొదటిది ఆశాభంగాన్ని పొందినప్పుడు, రెండవది శక్తిని పుంజుకుని విజృంభిస్తుంది. ఆ విధంగా సంపూర్ణమైన అవకాశం లభించినందుకు, ఆత్మ ఉత్సాహప్రపూర్ణం అవుతుంది. చిన్న చిన్న కష్టాలకు మనం పిరికిపందలం అవుతూన్నప్పటికీ, పెద్ద పెద్ద దుఃఖాలు మనలో పౌరుషాన్ని రేకెత్తించి ధైర్యవంతు లుగా చేస్తున్నాయి. అందుచేతనే, వీటిలో ఒక రకమయిన ఆనందం యిమిడివుంది.

దుఃఖంలో సంతోషం ఉందనడంలో వైరుధ్యం లేదు. ఆనందంలో అసంతృప్తి ఉన్నదనడంలో ఎంత నిజముందో, దుఃఖంలో సంతోషం ఉన్నదనడంలోకూడా అంతే నిజముంది. ఆ విధంగా ఎందుకు ఉంటుందో అర్థంచేసుకోవడం ఏమంత కష్టంకాదు.

షెలీదా,

24—6—1394

ఇక్కడ నేనున్నది నాలుగురోజులనుంచే. కాని గంట లను లెక్కించడంలో పొరపాటు పడ్డంవల్ల, ఎంతో కాలం అయినట్లు అగుపడుతూంది - ఈ రోజే. నేను కలకత్తాకు తిరిగి వెళ్ళవలసివస్తే అక్కడ ఎంతో మార్పు సంభవించి వుండటం ఖాయమనీ, నేనొక్కణ్ణిమాత్రం కాలప్రవాహానికి

లోబడక వెలుపల వున్నట్లు, ప్రపంచంలో జరుగుతూన్న మార్పులు ఏమీ నాకు తెలియనట్లు భావించేను.

కలకత్తాకు దూరంగావున్న ఈ స్థలానికి వచ్చి, ఇచ్చట నా ఆంతరంగిక ప్రపంచంలో నేను నివసిస్తున్నాను, ఇక్కడున్న గడియారాలు మామూలు కాలాన్ని తెలియజేయవు. ఇక్కడ కాలపరిమితి భావముల తీవ్రత ద్వారానే లెక్కించబడుతుంది. బాహ్యజగత్తు నిముషాలను లెక్కించదు. ఇచ్చట క్షణాలు గంటలుగానూ, గంటలు క్షణాలుగానూ మారుతూంటాయి. దీనివల్ల నాకు కనబడుతున్న దేమంటే, దేశకాలాల విభజన కేవలం మానసికమే అని. ప్రతి ఒక్క అణువూ అపరిమితమయింది. ప్రతి ఒక్క క్షణంకూడా అనంతమయింది.

పారసీక కథ ఒకటి ఉంది. చిన్న పిల్లవానిగా వుంటూన్నప్పుడు దాన్ని నేను చదివి అమితంగా ఆకర్షింపబడ్డాను. నేను బాలుడనైనప్పటికీ ఆ కథలో భావాన్ని అర్థం చేసుకున్నాననే అనుకుంటున్నాను. కాలంయొక్క మిథ్యాస్వభావాన్ని నిరూపించుటకై ఒక ఫకీరు రాజాస్థానికి వచ్చి, కొంత జలం తీసుకుని మంత్రించి ఆ మంత్రజలాన్ని ఒక తొట్టిలో పోసేడు. రాజును ఒకసారి అందులో మునగమన్నాడు. రాజు ఆ ప్రకారం ఒక్కసారి మునికి లేచేసరికి, సముద్రతీరాన గల వింతైన దేశంలో ఉన్నట్లు తెలుసుకున్నాడు. అక్కడ చాలా కాలం గడిపేడు. అనేక కష్టసుఖాలు అనుభవించేడు. వివాహం చేసుకున్నాడు. సంతానం కలిగింది తరువాత కొంత కాలానికి భార్యా బిడ్డలు మరణించేరు. ఐశ్వర్యం అంతా

పోయింది. ఆ విధంగా కష్టాలగానుగలో నలిగిపోతూ దుఃఖ భారంతో కృంగి కృశించిపోతూన్న ఆ రాజు పరివారంతో తన మందిరంలోనే తిరిగి వున్నట్లుగా హఠాత్తుగా తెలుసు కున్నాడు. తన దురదృష్టానికి కారకుడు ఆ ఫకీరే అని అతన్ని రాజు ఆగ్రహావేశుడై దూషించబోగా ప్రక్కనున్న పరివా రము రాజును వారించి "ప్రభూ! తమరు ఇక్కడే ఉన్నారు. ఈ తొట్టిలోని నీటిలో ఇప్పుడే మునిగి వెంటనే లేచేరు! అంతే జరిగింది!" అని చెప్పేరు.

సుఖదుఃఖాలతో కూడుకున్న మన జీవితాలుకూడా ఇదే మాదిరిగా మాయచే ఒక్క త్రుటికాలంలో కప్పబడ తాయి. జీవించి వున్నంతసేపూ - దాన్ని ఎంతో కాలం, ఎంతో గాఢంగా అనుభవించినప్పటికీ, ఇహ లోకం అనే ఈ తొట్టిలో మునగడం పూర్తయేసరికి, వెనుకటి జీవితం అంతా క్షణభంగురమైన కలలా, ఇట్టే గడిచిపోయినట్లు తెలుసుకుంటాం.

-షుేదా

9—8—1894

చనిపోయిన పక్షి ప్రవాహంలో కొట్టుకు వస్తూండగా ఇవాళ నేను చూసేను. దాని మరణోదంతాన్ని సులువుగా ఊహించగలం. ఒకానొక పల్లె ప్రాంతములో ఏదో ఒక మామిడిచెట్టు గుబురులో దాని గూడు ఉంది. అది తన సహ చర పక్షిబృందంతో కలసి స్వేచ్ఛగా తిరిగి సాయంత్రం అయే సరికి తన గూటికి చేరుకొని, అలసి సొలసిన తన చిన్న శరీ రాన్ని హాయిగా నిద్రపుచ్చింది. ఆ రాత్రి హఠాత్తుగా మహా

నదిస్తోయైన పద్మ, పొంగి పొరలుతూ దాని గూటిలోనికి వచ్చింది. ఆ మామిడి వృక్షం అడుగునగల నేలనంతా తుడిచి పెట్టేసింది. గూటిని నష్టబోయిన ఆ అల్పప్రాణి శాశ్వతంగా నిద్రపోయేముందు మేల్కొని ఒక్క తృటికాలం మాత్రం వుంది.

సర్వనాశనం చేస్తూన్న ప్రకృతియొక్క భయంకర మాయా సాన్నిధ్యంలో ఉండగా, మానవుడనయిన నాకూ, తదితర జీవరాసులకూ మధ్యగల తేడా అత్యల్పంగా గోచరించింది. నగరాల్లో మాత్రం మానవ సంఘమే అగ్రస్థానం అలంకరించి, ఘనంగా కనబడుతుంది. తమ సుఖదుఃఖాలు చూచుకుంటూ మహా స్వార్థపరులుగా మారిన మానవులు, తదితర ప్రాణికోటి – కష్టసుఖాలను కించిత్తయినా విచారించక దయా దాక్షిణ్య రహితులై ప్రవర్తిస్తున్నారు.

యూరపు ఖండంలోకూడా మానవుడే అధికారం చెలాయిస్తున్నాడు. అతని దృష్టిలో జంతువు అంటే ఉత్త జంతువు మాత్రమే ! జంతు జన్మనుంచి మనుష్యజన్మకు, మనుష్య జన్మనుంచి జంతుజన్మకు, జీవునకు జన్మాంతరాలు ఉన్నాయన్న విషయం హిందువులకు నూతనంగా కనబడదు. ఈ విధంగా జీవునకు జన్మాంతరాలు ఉన్నాయికాబట్టే సమస్త ప్రాణికోటియెడల కరుణ కలిగి వుండాలన్న పరమ ధర్మాన్ని అతిశయోక్తితో కూడుకున్నదని కొట్టిపారేయకుండా మన శాస్త్రాల్లో వుండనిచ్చేరు.

పల్లెప్రాంతానగల ప్రకృతితో అతి సన్నిహితంగా మెలిగినప్పుడు, నాలోని హైందవ తత్వం విజృంభిస్తుంది. ఆ

సమయంలో మృదు శరీరాలు గలిగి, హృదయంలో జీవితా నందం అపరిమితంగా స్పందిస్తూండగా తిరుగాడుతూన్న ఏ చిన్న పక్షికంటబడినా సరే, దాని సంతోషాన్ని పంచుకోకుండా నిర్లక్ష్యంగా వుండలేను.

షెలీదా

10—8—1894

గతరాత్రి నీటిలో ఏదో తొందరగావచ్చి పడుతూన్న శబ్దం వినబడగానే నాకు తెలివి వచ్చేసింది. అది బహుశా వరద అయి ఉండవచ్చు. ఈ కాలంలో సాధారణంగా వరదలు వస్తూంటాయి. పడవలో బల్లచెక్కమీదున్న నా పాదాలు అడుగున ఉన్న నీట్లో వివిధ శక్తులు చేస్తూన్న పనులను తెలుసుకుంటున్నాయి. చిన్నచిన్న కంపనలు, స్వాప్నమైన కుదుపులు, మెల్లగా మీదికి లేవడం, హఠాత్తుగా జోగడం...ఇవన్నీ ప్రవహిస్తూన్న నదితాలూకు నాడిని తెలుసుకోటానికి వీలు కల్పిస్తున్నాయి.

ఈ రాత్రి ఏదో ఒక విధమైన ఉద్రేకం హఠాత్తుగా కలగడంతోనే, నదీ ప్రవాహం వడివడిగా పరుగులు పెట్టడం ప్రారంభించింది. నేను లేచి కిటికీ ప్రక్కకు వెళ్ళి కూచున్నాను. ఏదో మసక వెలుతురు, అసలే అల్లకల్లోలంగా వున్న ఆ నదిని, మరింత వున్మాదావస్థలో వున్నట్లుగా కనబడుస్తూన్నది. ఆకాశంలో చెదురు మదురుగా మేఘాలున్నాయి. మహోత్కృష్టమయిన ఓ పెద్ద నక్షత్రంయొక్క ప్రతిబింబం నీళ్ళలో వణుకుతూ, గాయాల భగభగ మంటలతో బాధపడుతున్నట్లుగా గోచరిస్తోంది. వుభయ తీరాలు, నిద్రా

మైకంలో అస్పష్టంగా వున్నాయి. ఆ తీరాల రెండింటి మధ్యా నిద్ర, విశ్రాంతి లేక ఆగ్రహావేశంతో, భవిష్యత్ఫలితాలను లక్ష్యం చేయకుండా, ఈ ప్రవాహం వురకలువేస్తూ, పరుగు లెడుతూంది.

నిశామధ్యంలో ఇటువంటి దృశ్యాన్ని తిలకిస్తూంటే నైమరపు కలుగుతుంది. మనలోపూర్తిగా మార్పు కలిగి నూతన వ్యక్తిత్వం గోచరిస్తుంది. ఆ సమయంలో పగటి జీవితం ఉత్త మిథ్యగా కనబడుతుంది. మళ్ళా ఈ ఉదయాన చూస్తే, నిశామధ్య గోచరించిన ప్రపంచం, ఏదో ఒకానొక స్వాప్నిక సీమలో కరగి, గాలిలో అదృశ్యమయింది. ఈ రెండు ప్రపంచాలు వేరు వేరు అయినప్పటికీ, మానవునికి ఈ రెండూ వాస్తవికమైనవే.

పగటి ప్రపంచం నాకు ఐరోపీయ సంగీతంలా విభిన్న శృతులు పరస్పర సమ్మేళనంపొంది ఒకేఒకస్వరలహరిగా సాగి పోతూన్నట్లుగా—అగపడుతుంది. రాత్రి ప్రపంచం, హైందవ సంగీతంలా – నిర్మలంగా, అపశృతి రహితంగా, మధురంగా, సునిసితంగా, గంభీరంగా ఉంటుంది. ఆ రెండింటికి వ్యత్యాసం ఎంత వుంటేమాత్రం ఏమి ? ఆ రెండూకూడా మానవుని కదల్చివేస్తాయి ! ఈ విభిన్నత్వసూత్రం సృష్టిమూలంలోనే వుంది. అది, రాజూ రాణీ, రాత్రీ పగలు, ఏకత్వం అనేకత్వం, పురుషుడూ ప్రకృతి—వీరి పరిపాలనలలో అమలు జరుపబడి వుంది.

హిందూదేశస్థులమైన మనం రాత్రియొక్క పరిపాలన క్రింద ఉన్నాం. శాశ్వతత్వం, ఏకత్వంలో, మునిగిపోయి

వున్నాం. మన మధుర గీతాలను ఒంటరిగా ఎవరి మట్టుకు వారమే పాడుకోవాలి. ద్వైసందిన ప్రపంచంనుండి ప్రశాంత ఏకాంత సీమల్లోకి అవే మనలను తీసుకువెళతాయి. వీరోచిత సంగీతం జనబాహుళ్యాలకు ఉద్దేశింపబడింది. అది మానవులను సంతోష దుఃఖాల నిమ్నోన్నతాలగుండా నృత్యంచేస్తూ తన వెంబడి తీసుకు వెళుతుంది.

షెలీదా.

13-8-1894

నేను ఏదయితే యదార్థంగా ఆలోచిస్తానో, అనుభూతి పొందుతానో, అర్థంచేసుకుంటానో, దాని పర్యవసానం ఏమంటే యదార్థంగా వ్యక్తంచేయడమే. ఆ లక్ష్య సాధన కోసమే నాలో ఏదో నిగూఢ శక్తి నిరంతరం పరిశ్రమిస్తోంది. అది నా ఒక్కనిలోనే కాక విశ్వమంతటిలోనూ నిండివుంది.

విశ్వవ్యాప్తమైన ఈ శక్తి ఒకే ఒక వ్యక్తిలో సాక్షాత్కరించినప్పుడు, ఆ వ్యక్తి అనుజ్ఞలకు లోబడక, తన స్వభావానుగుణ్యంగా అది పనిచేస్తుంది. మన జీవితాలను అ శక్తికి స్వాధీనంచేయటంలోనే, మనకు బ్రహ్మానందం లభ్యమవుతుంది. అది మనకు భావప్రకటనాశక్తినేగాక ఇంగిత జ్ఞానాన్ని, ప్రేమనుకూడా ప్రసాదిస్తుంది. వీటివలన మన భావాలు ఎప్పటికప్పుడు నిత్యనూతనంగానూ అద్భుతంగానూ ఉంటాయి.

నా చిన్న కుమార్తె నన్ను ఆనందపరవశుణ్ణి చేసినప్పుడు, మాయా మూలమైన విశ్వానందంలో ఆమె లీనమయి పోతుంది. అప్పుడు ఆమెను ప్రేమపూర్వకంగా ముద్దిడు

కొని లాలించటం ఒక ఆరాధన మాదిరిగా జరిగిపోతుంది. వాస్తవికానికి, ప్రేమ అనేది భగవన్నామయను ఆరాధించటం కన్నా అన్యంకాదు. అయితే ఆ ఆరాధనను తెలియకుండానే చేస్తున్నాం. ఆ విధంగా కాకపోతే అది అర్ధరాహిత్యమైనదే.

ఈ భౌతిక ప్రపంచంలో చిన్నవాటినీ, పెద్దవాటిని ఒకే విధంగా నడిపిస్తున్న, విశ్వాకర్షణ మాదిరిగా ఈ విశ్వానందం తన ఆకర్షణను మన ఆంతరంగిక ప్రపంచమంతటా వినియోగిస్తుంది. మనం దానిని పాక్షిక దృష్టితోగాని చూసిన యెడల, మన తెలివితేటల్ని దిగ్భ్రమ చెందిస్తుంది. మానవుని లోనూ, ప్రకృతిలోనూ ఆనందాన్ని ఎందుకు కనుగొంటున్నాం అన్నదానికి సరిఅయిన సమాధానం ఉపనిషత్తులలో ఈ విధంగా ఈయబడింది.

ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే
ఆనందేన జాతాని జీవంతి"

ఆనందంవల్లనే సమస్త భూతములు జన్మిస్తున్నాయి. జన్మించినవి ఆనందం వలననే జీవిస్తున్నాయి.

షెలీదా

19-8-1894

వేదాంతం చాలామందికి విశ్వాన్ని గురించి దాని సృష్టికిగల మూలకారణం గురించి గల సమస్త సంశయాలను నివృత్తి చేసుకునేందుకు సహాయకారిగా ఉన్నట్లు గోచరిస్తోంది. గాని నా సంశయాలు మాత్రం నివృత్తికాకుండా అలాగే ఉండిపోయాయి మిగతా మతాలు చాలా వాటికన్నా వేదాంతమ్మే సులభమైనదనడం యదార్థమే. సృష్టి, సృష్టికర్త

గూర్చి గల సమస్య, చూడగానే కనుపించిన దానికన్నా ఎంతో కుటిలమైనది గాని వేదాంతం ఈ క్లిష్టమైన సమస్యను సగం వరకు పరిష్కరించి, సుగమం చేసింది. సంశయ గ్రంథిని ఛేధించిందిగాని సృష్టిని గురించి మాత్రం ముట్టుకోకుండా వదలి వేసింది.

బ్రహ్మసత్యం జగన్మిథ్య! ఉన్నదల్లా బ్రహ్మపదార్థం ఒక్కటే. మనమంతా ఉన్నట్లు ఊహిస్తున్నాం గాని వాస్త వానికి లేనట్లే. ఇటువంటి భావనకు మానవ మస్తిష్కంలో జాగా ఎలా దొరికిందని ఆశ్చర్యం కలుగుతోంది. ఆ భావన ధ్వనిస్తూన్నంత అసంగతంగా లేదని జగత్తు ఉనికి సత్యమేనని నిరూపించటమే అందులో గల కష్టమని అనుకోవటం మరీ ఆశ్చర్యంగా ఉంది.

చంద్రుడు అప్పుడే మీదికి వచ్చేసాడు. ఆ వెన్నెల్లో పడవ పైభాగాన అర్ధనిమీలిత నేత్రాలతో కాళ్ళుచాచుకొని పడుకున్నాను. సమస్యలతో ఇంతవరకు వేడెక్కిపోయిన నా తలకాయ మలయ పవనాలు వీచడంతోనే చల్లబడింది. అప్పుడు- నాచుట్టూగల పృథ్వీజల ఆకాశాలు, నదీతరంగాల మధురమంజుల ధ్వనులు, ఒడ్డున కాలిబాటన వెళుతూన్న పథి కుడు, బంగుకుతూ పోతూన్న డింగీ, పొలాల మీదుగా వెన్నెల్లో అస్పష్టంగా కనబడుతూన్న చెట్లూ, తోపులు చీకటి నీడలతో చుట్టబడి నిద్రిస్తూన్న దూరాన పల్లె- అన్నీ మాయా స్వరూపాల్లాగే కనబడ్డాయి. అవి మాయ అయినప్పటికీ నన్ను పట్టుకుని వదలలేదు, సత్యం కన్నా నిజ మయిన సత్యంగా భాసిస్తూ మనస్సుని, హృదయాన్ని అమి

తంగా ఆకర్షించ సాగేయి. సత్యమనేది నిజానికి అగపడదే! ఇలా కంటికగపడుతూ మనలను ఆకర్షిస్తూన్న వస్తుజాలంనుండి విడినది, మనం సాధించేమోక్షం ఏమిటో దురూహ్యంగా ఉంది.

షాజద్‌పూర్
5-9-1894

స్థలం కోసం నేనెంత క్షుదార్తుడుగా ఉన్నానో తెలుసుకుని, ఈ గదుల్లో ఆ ఆకలిసంతా తీర్చుకున్నాను. గదుల తలుపులు, కిటకీలు పూర్తిగా తెరచి నా రాజ్యానికి నేను ఏకచ్ఛత్రాధిపత్యం వహించేను. ఇక్కడ నాకున్నంత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మరెక్కడా లేవు. బాహ్య జగత్తుయొక్క కదలికలు, పచ్చని తరంగ పంక్తులలో నా అంతరంగాన ప్రవేశించి, వాటి ఉజ్జ్వలకాంతి, మధుర పరిమళం, మంజుల ధ్వనితో నా ఊహాసుందరిని కథారచనకు పురికొల్పేయి.

మధ్యాహ్నలకు ప్రత్యేకమైన ఆకర్షణ, మనోహరత్వం వున్నాయి. కళ్ళకు జిగేలు మనిపిస్తున్న సూర్యకాంతి, నిశ్శబ్దం, ప్రశాంత ఏకాంతం, పక్షుల కూజితాలు, ముఖ్యంగా కాకుల కాకా అరపులు, అహ్లాదకరమైన విశ్రాంతి, - ఇవన్నీ కలిసి నన్నెక్కడికో ఎత్తుకుపోవడానికై కుట్ర పన్నేయి.

సరిగ్గా ఇటువంటి సుందర మధ్యాహ్నా వేళలే "అరేబియన్ నైట్సు" కథా రచనకు దోహదం ఇచ్చి వుంటాయి. అరేబియా దేశంలోగల రమాస్కస్, బొఖారా, సమర్ ఖండులు, - ఎడారులకు పోయే బాటలు, ఒంటెల బారులు, అశ్వికదళ యోధులు, ఖర్జూరపు చెట్ల చల్లనినీడల్లో గల స్వచ్ఛ

న్మైన నీటి ఊటలు - విరగబూచిన సుందర గులాబీ తోటలు, కోయిలల తీయని పాటలు, షిరాజ్ ద్రాక్షసారాయిలు - ఇరుకుగా ఉన్న బజారు మార్గాలు, వాటిమీద వ్రేలాడు తూన్న మెరపు చాందినీలు, బాగా వదులైన దుస్తులు ధరించి రంగు రంగుల తలపాగాలు పెట్టుకుని, ఖర్జూరం, కర్బూజాలు, పోక చెక్కలూ అమ్ముతూన్న పురుషులు - చందనాగరు ధూపాలతో గుబాళిస్తున్న ప్రాసాదాలు, అతి వైభవో పేతంగా వున్న దివాణాలు- సొగసుగా అలంకరించిన జాకెట్లు, వెడల్పయిన ఇజార్లు, బంగారు బుటాలు కుట్టిన పాదరక్షలు, ధరించిన ఆ జోబీడియా, అమీనా, సూఫియాలు, వారి పాదాల దగ్గర చుట్టుకుని పడివున్న పారసీక హుక్కా తాలూకు పొడుగాటి రబ్బరు గొట్టాం, కళ్ళు మిరుమిట్లు గొలిపే ఉడుపులు ధరించి ఆ స్త్రీలను కాపలా కాస్తూన్న ఖోజాలు - ఇంకా చాలా చాలా సంభవమయినవీ, అసంభవ మయినవీ, నమ్మదగ్గవి, నమ్మ శక్యముకానివీ, సంతోష సమన్వితాలు, దుఃఖదాయకాలు అయిన మానవకృత్యాల యొక్క, ఆకాంక్షలయొక్క, గాథలతో నిండిన ఆ అరేబియన్ నైట్సు రచనకు ఈ మధ్యాహ్న వేళలే ఉత్సాహాన్ని ఇచ్చి వుంటాయి.

డిగాపాటియాకు
వెళుతూ దారిలో
20-9-1891

వరదనీటిలో మహావృక్షాలు నుంచుని ఉన్నాయి. వాటి మానులు నీటిలో పూర్తిగా మునిగిపోయాయి. వాటికొమ్మలు

ఆకులు ఆ నీటిమీదకు వంగి ఉన్నాయి. మామిడి చెట్ల నీడ లలో పడవలు కట్టబడి ఉన్నాయి. వాటి వెనుక ప్రజలు స్నానాలు చేస్తున్నారు. ఆ ప్రవాహంలో అక్కడక్కడ కొన్ని పూరిగుడిసెలు కనబడుతున్నాయి.

పంట చేలమీంచి నాపడవ మర్మరధ్వని చేసుకుంటూ వెళుతూండగా, మధ్య మధ్య పడియల్లాంటివి తారసిల్లు తున్నాయి. అవి పూర్వపు పడియలని గుర్తించాలంటే అక్కడ రాసులురాసులుగా ఉన్న నీటికలువలు, చేపలనువేటాడుతూన్న కొంగలు తదితర పక్షుల ద్వారానే తెలియ వీలవుతుంది.

వీలున్నంత మేరా నీరు జొచ్చుకొనేఉంది. భూమి ఈ విధంగా పూర్తిగా ఓడిపోవటం ఇంతకుముందు నేనెప్పుడూ చూడలేను. ప్రవాహం ఇక ఏమాత్రం పెరిగినాసరే, సరాసరి ఇళ్ళల్లోకి వచ్చేయటం ఖాయం. ఇళ్ళల్లో ఉన్నవారందరూ మంచెలు వేసుకుని బయట జీవించాల్సి వస్తుంది. పాపం ఆ గోవులు మోకాళ్ళలోతు నీళ్ళలో అలా నుంచునే ఉన్నాయి. ఇంకా గంటల తరబడి అలా ఉండవలసివస్తే అవి చనిపోతాయి. కలుగుల్లోంచి అసంఖ్యాకంగా పాములూ తదితర సరీసృపాలూ కొట్టుకువస్తున్నాయి. తమ నివాసాలు గోల్పోయిన అవి ఇక పైని మానవునితో చెలిమిచేసి, అతని పూరిగుడిసె కప్పులలో తలదాచుకోవాలి.

నీటిలో కుళ్ళిపోతూన్న చెట్లూ చేమా- నీట్లో తేలు తూన్న అన్నిరకాల పెంట, చుట్టుకు పోయిన అవయవాల తోనూ, బల్లలు పెరిగిన బాన పొట్టలతోనూ, దిగంబరులై నీటిలో ఆడుతూ పాడుతూన్న పిల్లలు- దీర్ఘరోగాలతో బాధ

పడుతూ, గాలీవానలో తడిబట్టలతోనే దైనందిన గృహ కృత్యాలలో ఈదులాడుతూన్న రోగిష్టి ఇల్లాళ్లు- ఈ అనారోగ్య వాతావరణంలో అన్నిటిమీదా ఝుమ్మని మూగుతూ నల్లటి ముసుగులా పరచుకుని ఉన్న దోమలు- ఈ దృశ్యాన్ని చూడటానికి ఏమాత్రం కూడా మనస్కరించలేదు.

ప్రతిగృహం జలుబులతోను, జ్వరాలతోను, వాతనొప్పులతోనూ మూలుగుతూంది. మలేరియా జ్వరపీడితులైన పసిపాపల రోదనలు వినలేకపోతున్నాం. పాపం వారిని ఏదీ రక్షించలేదు! జుగుప్సాకరమై, అనారోగ్యకారియై, దుర్గంధభూయిష్టమై, ఉపేక్షింపబడిన ఆ ముటికి పేటల్లో ప్రజలు ఏవిధంగా నివసించ గలుగుతున్నారు? ఉన్న యదార్థం ఏమిటంటే, ఏ దొచ్చినా చేతులు ముడుచుకొని భరించటానికి మనం అలవాటు పడ్డాం. ప్రకృతి బీభత్సాలకుగాని, పరిపాలకుల దౌర్జన్యాలకుగాని, మన శాస్త్రాల ఒత్తిడికిగాని నోరెత్తి ఒక్క మాటకూడా ఎదురు పలక్కుండా ఓర్చుకుంటూ ఉంటున్నాం. కాని అవి మాత్రం మనలను గానుగలో పెట్టి నిరంతరం నలిపి పారవేస్తున్నాయి.

బోలియాకు వెళుతూన్న దారిలో

22-9-1894

నా జీవితోద్యానంలోకి ముప్పదిరెండు శిశిరాలు మాత్రమే అడుగిడి వెళ్ళేయని జ్ఞాపకం రాగానే నాకు ఒక విధమయిన వింత తోచింది. నా స్మృతి, జ్ఞాపకానికందని ఎంతో కాలం వెనక్కు పరుగెత్తింది. వెంటనే, నిర్మేఘ శిశిర ప్రభాతంలా, నా అంతరంగం కాంతి వెల్లువతో నిండిపోయింది

నేను తెలియని ఏదో ఐంద్ర జాలిక ప్రాసాదంలో ఒక కిటికీ దగ్గర కూచున్నట్లు, సమస్త గతస్మృతుల దివ్య పరిమళాలను గుబాళిస్తున్న మందమారుతాలు హాయిని ప్రసాదిస్తుండగా, ఆ పురాస్మృతుల మధుర దృశ్యాలను తిలకిస్తూ, మైమరచి ఉన్నట్లు అనిపించింది.

గోయెత్ కవీశ్వరుడు మరణ శయ్యపై ఉండి "ఇంకా ఎక్కువ కాంతి" కావాలని కోరుకున్నాడు, అటువంటి సమయాల్లో ఏదయినా కోరికగాని నాలో మిగిలి ఉంటే, అది "ఇంకా ఎక్కువస్థలం" కోసం కూడాను. నేను వెలుగునూ స్థలాన్నీ రెండింటిని అమితంగా ప్రేమిస్తాను. చాలామంది వంగదేశాన్ని మైదాన ప్రదేశం క్రింద జమకట్టేస్తారు. కాని దానిలోగల మనోహర ప్రకృతి దృశ్యాలు నన్ను బ్రహ్మానంద పరవశుణ్ణి చేస్తాయి. నిరాటంకమయిన దాని నిర్మలాకాశము, సంజవెలుగుతోనూ, సాంధ్య ప్రశాంతితోనూ నిండుగా వజ్రాలు నింపిన గిన్నెలా సుందరంగా ఉంటుంది.

అటువంటి దేశం, కంటితో చూద్దామన్నా, మనస్సులో ఊహిద్దామన్నా మరొకటి ఎక్కడుంది?

కలకత్తా
5-10-1894

రేపే, దుర్గాదేవి పండగ. నిన్నటిరోజున, నేను అలా వెళుతూండగా. దారిలో ప్రతి సంపన్న గృహస్థుని ఇంటా దుర్గా విగ్రహాలు తయారవుతూండడం నేను గమనించేను. పూజలు

జరిగే ఈ కొద్దిదినాల్లోనూ వృద్ధులు, యువకులుఅన్న భేదం లేకుండా అందరూ చిన్నపిల్లలుగా తయారవుతారు.

దాన్నిగురించి ఆలోచించినట్లయితే, ఆనందం కోసం చేసే ప్రయత్నమంతా నిజంగా ఆటవస్తువులతో ఆడుకోవటం వంటిదే. ఆటవస్తువులు వాటంతటవి నిరుపయోగాలే. బయట నుంచి చూస్తే ఈ పూజా సందర్భంలో అయ్యేఖర్చు అంతా దండగగా కనుపించవచ్చు. కాని దేశం అంతటా ఆవిధమయిన భావతరంగాన్ని లేవదీసిన ఆ పండగను, విగ్రహాలు మొదలయిన వాటి కయ్యే ఆ ఖర్చును నిరుపయోగం అని అనగలమా ? ఎటువంటి వ్యక్తి అయినా సరే ఈ పండుగ సందర్భంలో తన స్వార్థాన్ని వదలి నలుగురితో కలసి ఆనందిస్తాడు.

ఈ విధంగా సంవత్సరానికి ఒకసారి సమస్త ప్రజల మనస్సులు ఆనందంతో కరగి. అనురాగం, ఆప్యాయత, కనికరము ఉప్పొంగటానికి వీలుకలుగ చేసే ఈ దుర్గాదేవి పండుగ వస్తాంటుంది. దుర్గాదేవిని ఆహ్వానిస్తూ తిరిగి వీడ్కోలు చెబుతూ పాడే పాటలు, స్వస్తివాచకాలు, ప్రియుల కలయికలు మంగళ వాద్యఘోషలు, నిర్మల శరత్కాలాకాశము, కరగించిన పదారు వన్నె పసిడివంటి శరత్తు- ఇవన్నీ బ్రహ్మానందం లోని అంతర్భాగాలే.

పిల్లల ఆనందమే నిర్మలమైన ఆనందం. ఏ చిన్న వస్తువుతో నయినా సరే, తమకు ఇష్టమయిన ప్రపంచాన్ని సృష్టించుకోగల శక్తి వాళ్ళకు ఉన్నది. ఎంత అసహ్యంగా ఉన్న బొమ్మనయినా సరే, వాళ్ళ ఊహల్లో అతి అందగత్తెగా

తయారయి, వాళ్ళ జీవితాలలో కలసి మెలసి జీవిస్తుంది. ఈ విధంగా ఆనందించగల శక్తిని పెద్దయిన తరువాత కూడా ఎవడయితే నిలబెట్టుకోగలుగుతాడో అతడే నిజమయిన ఆదర్శ జీవి అని చెప్పాలి. అటువంటి వానికి వస్తువులు కేవలం కంటికి కనుపించటం, చెవికి వినుపించటమే కాకుండా హృదయానికి గోచరిస్తాయి కూడా. వాటికిగల సంకుచితత్వం అసంపూర్ణత్వం అతడు అందచేసే సంతోష సంగీత లహరిలో హరించి పోతాయి.

ప్రతి వ్యక్తీ ఆదర్శ పురుషుడు కాలేడు. కాని ఇటువంటి పండగ సమయాల్లో చాలమంది ఈ ఆనందస్థాయికి దగ్గరగా చేరుకుంటారు. అంతవరకు సాధారణ బొమ్మగా ఏదయితే కన బడతూఉందో, అప్పుడు అదేబొమ్మ తన పరిమితులను విడ నాడి, అఖండ తేజస్సంపన్నురాలయిన పరదేవతగా రూపొంది పూజల నందుకుంటుంది.

బోల్‌పూర్
19-10-1894

వ్యక్తుల్ని చుక్కలతో గీసిన చిత్రాల్లా మాత్రమే మనం ఎరుగుదుము. వాటిలో అక్కడక్కడ ఖాళీలు ఉంటే మన తెలివితేటలతో వాటిని పూర్తి చేసుకోవాలి. అదే విధంగా మనకు బాగా తెలిసిన వ్యక్తులందరూ, చాలా భాగం మన భావనల చేత రూపొందింప బడ్డవారే. కొందరి రేఖా చిత్రాలు ఎంతో తెగిపోయి, తెలుసుకోటానికి ఉంచిన చుక్కలు కూడా చెరగిపోయి, ఆ వ్యక్తుల పోలికపట్టడానికి కూడా అశక్యం అయిపోతాయి, మన ప్రాణస్నేహితులుకూడా

భావనా సూత్రానికి మాలగా గ్రుచ్చిన చిత్ర శకలాలయితే, ప్రపంచంలో మనం ఇహా ఎరిగిన వారెవరు? అసలు ఎవరి నయినా మనం ఎరుగుదుమా? మనలను కూడా అదేవిధంగా అసంపూర్తిగా గాక పూర్తిగా ఎవరయినా ఎరుగుదురా? అన్న అనుమానం కలగక మానదు. బహుశా, ఈ విధంగా ఆలోచించటం వలననే చివరికి స్నేహం బాగా పెంపొందవచ్చు. అలా కానిచో ఎవరిమట్టుకు వారే ఎవరి వ్యక్తిత్వపు కంచు కోటల్లో వారు భద్రంగా ఉండి, లోనున్న ఒక్క అంతరాత్మకు తప్ప, తదితరులకు తమను దరిచేర అవకాశం ఇచ్చి ఉండే వారు కాదు.

మన ఆత్మకుకూడా ఏదో కొంచెం కొంచెంగానే తెలుసు. ఈ ఆత్మపదార్థంయొక్క తునకలతోనే మన జీవిత కథా నాయకుణ్ణి రూపొందించుకోవాలి. అదేవిధంగా మన భావనల సహాయ సంపత్తితో కూడా మలచుకోవాలి. దైవం కొన్ని భాగాలను విడిచిపెట్టాలనే విడిచిపెట్టిందనటానికి ఏమీ సందేహంలేదు. అందులో ఆంతర్యం మన సృజనాశక్తిని మనం పెంపొందించుకోవాలనే.

బోల్‌పూర్
31-10-1894

ఉత్తర పవనాలు గజగజ ఒణికిస్తూ వీచటం ఈ రోజు నుంచే ప్రారంభించేయి. పన్నలు వసూళ్ళకై రాజోద్యోగి అప్పుడే ఉసిరిక తోపుల్లోకి వచ్చినట్లుగా అగపడతూంది. అక్కడున్నవన్నీ ఒణుకుతూ, నిట్టూరుస్తూ, వాడి, వన్నె తగ్గేయి. ఉలసట కారణంగా చురుకుతగ్గిన మధ్యాహ్నపు

సూర్యకాంతి, మామిడి గుబుర్లలోంచి అవిరళంగా వినబడు తూన్న పావురాయిల కువకువారావాలతో కలసి, రాబోయే ఎడబాటును తలచుకొని తీవ్రబాధతో ఉన్న పగటిని ఆచ్ఛా దిస్తూన్నది.

నా టేబిలు మీదున్న గడియారపు టిక్కు టిక్కు శబ్దం; నా గదిలోంచి బయటకు, బయటనుంచి గదిలోనికి రివ్వురివ్వున పరుగులుపెడుతూ ఉడుతలు చేస్తూన్న చప్పుడు, మిట్టమధ్యాహ్నపు తదితర ధ్వనులతో సమ్మేళనం పొందు తున్నాయి.

ఈ ఉడుతలను చూస్తే నాకు చాలా ఆనందం కలుగు తూంది. మెత్తటి శరీరాలు, ఒత్తుగా బొచ్చూ, నడ్డిమీద నలుపూ బూడిదరంగుగల చారలు, కుచ్చుతోకలు, మెరు స్తూన్న కళ్ళూ చూడముచ్చటగా ఉంటుంది. నెమ్మదిగా కన బడినప్పటికీ చురుగ్గా పనులు చక్కబెట్టుకుంటూ పోతూన్న ఈ ఉడుతలను చూస్తూంటే నాకు ఎంతో ఉల్లాసం కలుగు తూంది. ఈ తిండిపోతు ప్రాణులకు అందకుండా తినుబడి పదార్థాలన్నిటినీ ఇనపతివ్వ అల్లిన అలమారాల్లో భద్రపరచు కోవాల్సిందే. ఇంతచేసినా, అవి వాసన పసికట్టి, పరుగెత్తుకు వచ్చి అలమారాచుట్టూ వాసనచూస్తూ, తిరుగుతూ, లోనికి ప్రవేశించటానికి ఎక్కడయినా కన్నం దొరుకుతుందా అని ప్రయత్నిస్తూనే ఉంటాయి. గింజలుగాని, రొట్టెముక్క పిసర్లు గాని, ఏమాత్రం క్రిందపడి ఉన్నట్టయితే, వాటికంట పడటం ఖాయం. ఆ తినుబండారాన్ని ముందుకాళ్ళ పంజాలతో చప్పున అందుకుని, అటూ ఇటూ త్రిప్పుతూ, నోటికి సరిపడే

ట్టు సరిచేసుకుని తినడం ప్రారంభిస్తాయి. నా కదలికలో ఏ మాత్రం చప్పుడు వినిపించినా సరే, తోకలు మీదికెత్తుకుని రివ్వున ఎగిరిపోతాయి. పారిపోతూ పారిపోతూ మళ్ళా మధ్య దారిలో ఒక్క త్రుటికాలం ఆగి, తలుపుదగ్గర చాపమీద తోకలమీద కూచుని, వెనుక కాలిగోళ్ళతో చెవులు గోక్కుంటాయి. అటుపిమ్మట మళ్ళా తిరిగి వస్తాయి.

పళ్ళు పటపట లాడించటం, రివ్వురివ్వున పరుగు లెత్తడం, బీరువాలో ఉన్న పింగాణీ సామాన్లను కదుపు తూండడం, ఈ విధమయిన చిన్నచిన్న ధ్వనులు పగలల్లా వినబడుతూనే ఉంటాయి.

షెలీదా,

7-12-1894

పిండారబోసినట్లున్న వెన్నెట్లో సైకత తీరాన నేను నడుస్తూండగా, "ఎస్" అనే వ్యక్తి వ్యవహార విషయాలు ముచ్చటించటానికి వచ్చిపడుతూంటాడు.

నిన్న సాయంకాలం మళ్ళా వచ్చేడు. మాటాడ్డం పూర్తయి నిశ్శబ్దం నిండుకున్న తరువాతనే, సంధ్యా కాంతిలో ఎదుట సాక్షాత్కరించివున్న అనంత విశ్వాన్ని నేను తిరిగి దర్శించగలిగేను. ఎందుకూ పనికిరాని ఒక వ్యక్తి వ్యర్థ ప్రసంగం, సర్వవ్యాప్తమైన విశ్వరూపాన్ని సయితం మరుగు పరచిందంటే ఆశ్చర్యంగా ఉంది.

అతని మాటల వడగళ్ళ టపటపలు పరిసమాప్తమవ గానే నక్షత్రాల ప్రశాంతి లవెల్లివిరిసి, నా హృదయాన్ని నిండుగా నింపి పొంగి పొరసాగింది. పరమేశ్వరుని మహా

మాయా సభలో గుమిగూడిన ఈ కోటాను కోట్ల కాంతి గోళాలతో పాటు నేనూ ఒక మారుమూల జాగా చూచుకుని కూచున్నాను.

సాయంకాలం పెందలకడనే బయటికు బయలుదేరి వెళ్ళిపోయి, ప్రశాంతితో నా మనస్సును నింపుకోవాలి. ఆలస్యంచేసిన ఆ "ఎస్" వచ్చేస్తాడు. పాలు ఒంటికి పడ్డాయా అంటాడు. వార్షిక ప్రకటన చదవటం పూర్తిచేసారా అంటాడు. ఇంకా ఇలాంటి ప్రశ్నలు ఎన్నో వేస్తూ చిరాకు పుట్టిస్తాడు. అతను రాకుండానే వెళ్ళిపోవాలి.

శాశ్వతమైన పారమార్థికానికి, లౌకికమైన క్షణభంగురానికి మధ్య ఎంత విచిత్రంగా మనం ఉంచబడ్డాం! ' ఆత్మ సంబంధమైన విషయాలమీద మనస్సు లగ్నమయినప్పుడు, ఉదర సంబంధమైన సంగతుల ప్రసక్తి తెస్తే, అపశృతి ధ్వనిస్తూన్నట్లుంటుంది. అయినప్పటికీ, ఆత్మ, ఉదరం, రెండూ కలసే నివసిస్తున్నాయి ఎంతో కాలంనుంచి! నాకు గల భూసంబంధమైన ఆస్తి ఏదంటే పండువెన్నెల కురుస్తూన్న ఈ ప్రశాంత దేశమే! నా జమీందారీ అంతా కేవలం మిథ్యే అని వెన్నెల చెబుతోంది. ఈ వెన్నెల అంతా శూన్యమే అని నా జమీందారీ చెబుతోంది. ఈ రెండిటి మధ్య నా మనసు చెదరిపోయి ఏమీ తోచక దిగులుతో కూచుండిపోయింది.

"సాధన" మేగజైనుకు ఏదయినా వ్రాద్దామని ప్రయత్నించేసరికి మనస్సు మరెక్కడికో పోతూన్నది. నదిలో వెళుతూన్న ప్రతీ పడవకేసి కళ్ళెత్తి చూస్తూనే ఉన్నాను.

ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకు, ఆ ఒడ్డునుంచి ఈ ఒడ్డుకు తిరుగుతూ ప్రజలను నదిదాటిస్తూన్న దోనెలు కళ్ళల్లో అలా ఉండిపోతు న్నాయి, నా పడవకు సమీపాన్నే, గట్టుమీద గేదెలు కనుపించేయి. అవి తమ లావైన ముట్టెలను పచ్చగడ్డిలోనికి దూర్చి, దానిచుట్టూ నాలుకను చుట్టి నోటిలోనికి ఆ గడ్డి వచ్చేటట్టు చేసుకొని, మేస్తూపోతూ, దీర్ఘనిశ్వాసాలు గట్టిగావద లుతూ నడ్డిమీద వాలుతూన్న ఈగలను తోలుకుంటున్నాయి.

అంతలో హఠాత్తుగా, దుర్బలుడున్నైన ప్రవేలెడు మనుష్య కూన దిగంబరియై వాటిమధ్య ప్రత్యక్షమయి రకరకాలుగా అరుస్తూ గొడవచేస్తూ, క్షమాస్వరూపాలయిన ఆ పసువు లలో ఒకదానిని దుడ్డుకర్రతో పక్కలో గట్టిగా పొడిచేడు. ఆ సాధుజంతువు, బొడ్డూడని ఆ పసికందుమీద ఏమాత్రం కోపం తెచ్చుకోలేదు. కాని జాలిగా అతనికేసి చూస్తూ, నాలుగడుగులు అలా వెళ్ళిపోయింది. వెళుతూ త్రోవలో దొరికిన ఆకుల్ని, గడ్డినీ తొందరగా కబళించ సాగింది.

ఆ రాక్షస పిల్లవాడు, పశులకాపరిగా తను చేయవల సిన విద్యుక్త ధర్మం అంతే అనుకుని తృప్తిపడుతూన్నట్లుగా కనుపించాడు.

ఆ పిల్ల పశులకాపరి మనస్సులో ఏముందో అర్థం చేసుకోలేక విఫలుడనయ్యాను. ఏదయినా ఓ ఆవుగాని లేక గేదెగాని తనకు నచ్చిన ప్రదేశాన్ని ఎంచుకుని, అక్కడ గడ్డిని హాయిగా మేస్తూన్నదంటే, ఆ పిల్లవాడు దానిని బాధించి, అది ఆ స్థలం వదలి మరోచోటికి వెళ్ళేవరకు అల్లరి చేస్తూండ

డంలో ఏం ప్రయోజనం ఉందో నేను ఊహించలేకపోతున్నా. మహాబలిష్టమయిన ఒక జంతువును మచ్చిక చేసి లొంగ దీసుకున్నా నన్న విజయ గర్వంతో మానవుడు చెలాయించే పెత్తనమేమోనని నేను అనుకుంటున్నాను! పుష్కలంగా ఉన్న పచ్చికలో తిరుగుతూన్న ఈ గేదెలను చూడ ముచ్చట పడతాను.

నేను చెప్ప ప్రారంభించినది మాత్రం ఇది కాదు. సాధన మేగజైనుకు నా విధిని సక్రమంగా నిర్వహించుదామని ఎంతను కున్నా, చిన్న చిన్న విషయాలు కూడా నామనస్సును ఏవిధంగా దారి తప్పిస్తున్నాయో చెబుదామను కున్నాను. నీకు లోగడ వ్రాసిన జాబులో మధుపాలు విసుగన్నది లేకుండా పట్టుదలతో నాచుట్టూ ఎలా వ్యర్థంగా తిరిగేయో అర్థరహితంగా ఎలా ఝుంకారాలు చేసాయో, వ్రాసేను!

అవి ప్రతిరోజూ ఉదయం సుమారు తొమ్మిది పది గంటలయ్యేసరికి వచ్చి నా టేబిలు మీద ముసురుతాయి. అక్కడనుంచి రివ్వున డస్కుపెట్టె క్రిందకు పరుగెడుతాయి. తరువాత రంగు గాజుతలుపు మీదకు ఎగిరి దాన్ని బాదుతాయి. అక్కడనుంచి ఇటువచ్చి నా తలచుట్టూ ఒకటి రెండు ప్రదక్షిణాలు చేసి, ఝుంకారం చేసుకుంటూ ఎక్కడకో వెళ్ళిపోతాయి.

ఈ ప్రపంచంలో జీవించి ఉన్నప్పుడు కోరికలు నెరవేరకుండా మరణించిన వ్యక్తులు, ఈ తుమ్మెదల రూపంలో భూలోకానికి మాటిమాటికి వస్తూ, వచ్చినప్పుడల్లా నన్ను శాస్త్ర పరికరించి పోతూన్నట్లు నేను అభిప్రాయపడి ఉండేవాణ్ణి.

కాని ఆ విధంగా మాత్రం అనుకోలేను. అవి నిజమయిన తుమ్మెదలే. వాటినే సంస్కృతంలో అయితే మధుపాలనీ, ద్విరేఫాలనీ పిలుస్తారని నాకు బాగా తెలుసు.

షెల్లీ
16-2-1895

జీవితయాత్రలో ప్రతి ఒక్క క్షణాన్ని దాచుకుంటూ వెళ్ళవలసిందే. అంత జీవితం, రెండు గంటల ఆలోచనలో ఇమిడిపోయిందంటే అది చాలా స్వల్పమే అనాలి.

ముప్ఫయి సంవత్సరాల ప్రయాస యుక్తమైన జీవితా నంతరం. షెల్లీ కవి శేఖరుడు, రెండు సంపుటాలకు మాత్రమే సరిపడే తన జీవిత చరిత్ర విషయాన్ని సరఫరా చేయగలిగేడు. అందులో అయినా చాలా భాగం డౌడన్ వాచాలతతోనే నిండిపోయింది. నా ముప్పది సంవత్సరాలు జీవితం ఒక్క సంపుటానికి కూడా చాలదు అనిపిస్తోంది.

ఆవగింజలో అరవయ్యోవంతు మాత్రమే ఉన్న ఈ స్వల్పాతిస్వల్పమైన జీవితంలో చేయవలసినది ఎంత ఉంది! ఒక సైన్యానికి కావలసిన భోజనసామగ్రి మాత్రమే సమకూర్చటానికి, ఎంత పంటభూమి, ఎంత వ్యాపారం, ఎంత వాణిజ్యం అవుసరమో, ప్రపంచంలో ప్రతిమానవుడూ, తనకు చిన్న కుర్చీలోగల స్థలమే అధికమయినప్పటికీ, ఎంత ప్రదేశాన్ని ఆక్రమిస్తున్నది ఆలోచించటానికయినా కాలం సరిపోతుందా! ఇవన్నీ అయ్యేక, మిగిలిన విషయం రెండు గంటల ఆలోచనకు కొన్ని పేజీల రచనకు మాత్రమే సరిపడుతోంది!

ఆ కొద్ది పుటల్లో, ఈ సోమరి రోజు ఆక్రమించినవి లెఖ్ఖలోనికి వస్తాయా! అలాంటప్పుడు, నెమ్మదిస్తున్న నదీతీరాన గల నిర్జన ఇసుక ప్రదేశాల్లోని ఈ ప్రశాంత దినం నా భూత భవిష్య జీవితాల మీద సుస్పష్టమైన బంగారు ముద్రలను శాశ్వతంగా విడవదా ?

షెలీదా
28-2-1895

ఈ రోజున నాకు ఒకఆకాశరామన్న ఉత్తరం వచ్చింది. అది ఈవిధంగా ప్రారంభమయింది.

"తన అహంకార మమకారాల్ని మరొకని చరణార విందముల దగ్గర విడచివేయడమే కానుకలలో కల్లా నిజమ యిన కానుక."-

ఆ ఉత్తరం వ్రాసిన వ్యక్తి నన్నెన్నడూ చూడనేలేదు. కాని నన్ను నా రచనల ద్వారానే తెలుసుకున్నాడు. ఇంకా ఈ విధంగా వ్రాసేడు:-

* రవి ఉపాసకుడు ఎంత చిన్నవ్యక్తి అయినప్పటికీ, ఎంత దూరాన ఉన్నప్పటికీ, రవి కిరణ ప్రసాదం అతనికి విధిగా లభిస్తుంది. నీవు విశ్వకవివి అయినప్పటికీ నాకు మాత్రం నా కవివిగానే కనబడుతున్నావు !

ఈ ధోరణిలోనే ఉత్తరం అంతా నడిచింది.

---

* రవి :- ఇక్కడ రవి అంటే రవీంద్రుడన్నమాట.

మానవుడు తన ప్రేమామృతాన్ని ఏదో ఒక వస్తువుపై వర్షిద్దామని కుతూహల పడుతుంటాడు. చివరికి తన ఆదర్శాన్నే ప్రేమించి ముగిస్తాడు. అతని అభిప్రాయం అంత నిజమయింది కాదని, వాస్తవికానికి దూరం అని మనం ఎందుకు శంకించాలి? ఇంద్రియాలద్వారా మనకు లభించేదానిలో సత్యం ఎంత ఉన్నదో తెలుసుకోవడం సాధ్యంకాదు. మనస్సుకూడా ఒక ఇంద్రియమే. అటువంటప్పుడు, మనోజన్యాలయిన భావాలను వాటి వెనుకనున్న సత్యాన్ని గురించి ఇంకా ఎక్కువగా శంకించటం ఎందుకు ?

తల్లి తనబిడ్డలో అలౌకికానందాన్ని పొందుతుంది. ఆ ఆనందపరచే గుణం ప్రతి బిడ్డలోనూ ఉంది. ఆతల్లి తను పొందిన అనిర్వచనీయానందాన్ని, ఇతరుల కెవ్వరికీ తెలియ చెప్పదు. ఆ మాతృదేవత జీవితాన్ని, ఆత్మను ప్రగాఢంగా ఆకర్షిస్తూన్న ప్రేమ ఏదయితే ఉందో అది కేవలం మిథ్య అని కొట్టిపారేసి, మనలనందరినీ ఆ అంతస్థుకి ఏదయితే తీసుకు వెళ్ళలేకున్నతో అదే నిజమని అనాలా ?

ప్రతిమానవుడూ అపరిమితమైన ప్రేమ సంపదకు ఆలవాలము. అతని ఆత్మ సౌందర్యానికి పరిమితన్నది లేదు. సర్వసాధారణంగా ఉండే విషయాలు చెప్పటంలోకి దిగేను. అసలు విషయం వదిలిపెట్టేను. నేను చెప్పదలచుకున్న దేమంటే నన్ను శ్లాఘిస్తూన్న ఈ ఉత్తరం వ్రాసిన వ్యక్తి తాలూకు హృదయోపహారాన్ని అందుకునేందుకు నాకే మాత్రం హక్కులేదు. నన్ను అనునిత్యం దగ్గరుండి చూస్తే

ఆ వ్యక్తికి నాయందు అటువంటి పూజ్యభావం కలిగి ఉండ దనుకుంటాను.

మరొక దృష్ట్యా చూస్తేమాత్రం ఈ పోగడ్తలకు, ఇంకా ఎక్కువగా పూజింపబడటానికి అర్హుణ్నే.

పాబ్నాకు వెళ్ళే మార్గంలో
9—7—1895

ఇప్పుడు నేను ఇచ్ఛామతి అనే చిన్న ఏటిలో ప్రయాణం చేస్తున్నాను. మెలికలు మెలికలుగా ఉన్న ఈఏరు ఒక్క వర్షాకాలంలోనే ప్రవహిస్తుంది. గట్ల పొడుగునా బారులు బారులుగా ఉన్న పల్లెలతోను, జనుము, చెరకుతో నిండినపొలాలతోనూ, అక్కడక్కడ గల రెల్లుపొదలతోనూ, పసిరికతో నిండి ఏటవాలుగా ఉన్న స్నానాల రేవులతోనూ, ఈనది ఎంతో మనోహరంగా ఉంది. మధురమైన మాటిమాటికి చదవబడుతూ, ఆనందింప చేస్తూన్న పద్యచరణంలా ఉంది ఈ నది, దాని దృశ్యాలు. పద్మానదివంటి పెద్దనదిని స్మృతిపథంలో పూర్తిగా నిలుపు కోలేం. కాని మెలికలు మెలికలుగా తిరుగుతూ ప్రవహిస్తోన్న ఈ చిన్ని ఇచ్ఛామతిని, వర్షాల లయలకు అనుగుణ్యంగా సంచరించే ఈ సెలఏటిని, క్రమక్రమంగా నా దానినిగా చేసు కుంటున్నాను.

ఇప్పుడు సంధ్యాసమయం ఆకాశం. మేఘావృతం అయింది. చీకట్లు అలముకుంటున్నాయి. మేఘాలు హుందాగా గర్జిస్తున్నాయి. కోపించిన స్వరగుచ్ఛు చెట్లు, తమ మధ్యనుంచి

పేసుగులు పెనుతూన్న ఝంఝామారుతాల తాకిడికి ఏమీ చేయలేక అల్లల్లా వంగుతున్నాయి. దట్టంగాఉన్న పెదురు పొదలు సిరాలా నల్లగా కనబడుతున్నాయి. పాలిపోయిన సంధ్యాకాంతి, నీటిమీద స్వల్పంగా పడుతూ, ఏదో ప్రళ యాన్ని సూచిస్తున్నట్లుంది.

ఈ మసకకాంతిలో, డెస్కుపెట్టెమీదకు వంగి, నేనీ ఉత్తరాన్ని నీకు వ్రాస్తున్నాను. ఈ వాతావరణానికి అనుకూ లంగా ఉండేట్టు, సన్నగా, మెల్లగా, ప్రియమైన విషయాలు రహస్యంగా చెవిలో చెప్పాలని అనుకుంటున్నాను. సరిగ్గా ఇటువంటి కోరికలే, మన ప్రయత్నాన్నంతా భంగపుచ్చు తాయి. ఆ కోరికలు నెరవేరుతే వాటంతటవే నెరవేరుతాయి. లేకపోతే పూర్తిగా నెరవేరవు. భీషణ రణానికి సన్నద్ధుల మవడం అంత కష్టమైన విషయం కాదుకాని ఒకదానితో ఒకటి సంబంధం లేని విషయాలను నోటికివచ్చిన విధంగా, తేలిగ్గా మాట్లాడ్డం మాత్రం కష్టమే.

పె. లీ దా,

14—8—1895

పనిలోఉన్న ఒక ముఖ్యాంశం ఏదంటే, దాన్ని చేయ వలసి వచ్చిననాడు, స్వకీయ సుఖదుఃఖాలను తేలిగ్గా చూడ వలసి ఉంటుంది, అంతేకాదు నిర్లక్ష్యం కూడా చేయవలసి వస్తుంది. షాజెద్‌పూర్‌లో జరిగిన ఓ సంఘటన ఈ సంద ర్భంలో నాకు జ్ఞాపకానికి వచ్చింది. నా నౌకరు ఒకరోజు ఉదయాన ఆలస్యంగా వచ్చేడు. ఆలస్యంగా వచ్చేడని వానిపై

వాడికి కోపం వచ్చింది. వాడు నా దగ్గరకు వచ్చి యథాప్రకారంగా సలాంచేసి, నుంచుని, గద్గద కంఠంతో తన ఎనిమిదేళ్ళ కుమార్తె గతరాత్రి చనిపోయిందని చెప్పేడు. ఆ వెంటనే గుడ్డ తీసుకుని నా గదిని పరిశుభ్రం చేయటానికి ఉపక్రమించేడు.

ఈ కర్మక్షేత్రం కేసి చూడగానే, వ్యాపారస్థులు కొందరు, భూమిని దున్నుతూన్న రైతులు కొందరు, బరువులు మోస్తున్న కూలీజనం కొంతమంది, మనకు కనబడుతారు. వారి అడుగున, మృత్యువు, దుఃఖం, నష్టం కంటికగపడని అంతర్వాహినులుగా అనవరతం ప్రవహిస్తూనే ఉంటాయి. వాటి గోప్యతకు మాత్రం ఏ భంగమూ వాటిల్లదు. ఇవిగాని ఎప్పుడయినా కట్టలు త్రెంచుకుని పొంగి పొరలి, ఆపినా ఆగక ఉపరితలానికిగాని రావడం జరిగితే, ఈ పనిపాట్లన్నీ ఎక్కడికక్కడ స్తంభించిపోతవి.

అడుగున ప్రవహిస్తున్న వ్యక్తిగత దుఃఖప్రవాహం మీదుగా కఠినమైన రాతిమార్గం ఒకటి ఉంది. దానిమీదనే విధులు అనే రైళ్ళు, మానవ సంబంధమైన బరువులను మోసుకుంటూ త్రోవలో బిగ్గరగా అరుస్తూ, ఒక్క నియమిత స్థలాల్లో తప్ప మరెక్కడా ఎవరిగురించి ఆగక పోతుంటాయి. ఈ హింసయే, మానవుడు తనను ఓదార్చుకోటాన్ని నిరూపిస్తుంది. పనిలో గల ఈ హింసయే బహుశా మానవుని ఓదార్చుకునే శక్తిని నిరూపిస్తుంది.

కుష్టీ,
5—10—1895

పురాణాల్లోంచి మనకు సంక్రమించిన మతం మన స్వంతం ఎన్నటికీ కాజాలదు. దానితో మనకుగల సంబంధం అలవాట్లకు సంబంధించినదే. అంతరంగంలో మతం వెలయించుకోవాలంటే మానవుడు తన యావజ్జీవితం కృషి చేయాలి. ఆ మతం అతని వేదనల తీవ్రతలోంచే ఉద్భవించాలి. అతని జీవనాధారమైన రక్తంమీదనే అది జీవించాలి. అది అతనికి సుఖాన్ని ప్రసాదించినా, ప్రసాదించక పోయినా, తన విధిని తను సక్రమంగా నిర్వహించేనన్న ఆనందంతో, మానవుని జీవితయాత్ర అంతమవుతుంది. సత్యమనే దేవాలయ నిర్మాణం మన అంతరంగంలోనే కొనసాగుతూండగా, దాన్నిగురించే ఇతరులు ఏదో చెప్పగా వినడమో, లేక ఉచ్చరించడమో ఎంతబూటకమైనదీ చాలా అరుదుగా తెలుసుకుంటాం.

మన సుఖదుఃఖాలను, పరుగులు పెడుతూన్న కాల వాహిని మధ్యలో, వేటికి వాటినే వేరుచేసి దర్శించిననాడు, శాశ్వతమైన ఈ కట్టడం తాలూకు ఇంద్రజలాన్ని అర్థం చేసుకోలేం. వాక్యంలోగల ప్రతిపదానికీ వర్ణక్రమం చెప్పు కుంటూ వెళ్ళిననాడు ఆ వాక్యం అర్థమేకాదు.

సృష్టి తాలూకు ప్రణాళికలోగల ఏకత్వాన్ని లోతుగా చూస్తే, బ్రహ్మాండానికి మనకూగల సంబంధాన్ని తెలుసు కోగలుగుతాం. వేటిస్థానాల్లో అవి ఉండి పరిభ్రమిస్తూన్న కాంతిగోళాలు ఏ విధంగా సృజింపబడ్డాయో, ఆ విధంగానే

మనంకూడా సృజింపబడుతూ ఉన్నాం. వ్యక్తిగత కోరికలు, బాధలు అన్నీకూడా ఈ పిండాండంలోనే వాటివాటి స్థానాలను అవి ఆక్రమించుకుని ఉంటాయి. సృష్టి కార్యక్రమం ఒక నిర్ణీత క్రమంలో జరుగుతూంటుంది.

ఎక్కడ ఏం జరుగుతూన్నదీ మనకు సరిగా తెలియదు. ఒక ఇసుక రేణువు గురించి అయినా మనకు సరిగా తెలియదు. కాని మనలో గల చైతన్య ప్రవాహం బాహ్యజగత్తులోని చైతన్య స్రవంతికన్న భిన్నం కాదని అనుభూతిపొందిననాడు, మన సుఖదుఃఖాలు ఆనందమనే పొడుగాటి దారానికి గుచ్చబడ్డ పూలలాగా గోచరిస్తాయి. నేనున్నాను, నేను కదలుచున్నాను, నేను పెరుగుచున్నాను (అస్థి, జాయితే, వర్థతే) అనే ఈ వాస్తవికాలను నాతో కలసే మిగతావన్నీ కూడా ఉంటున్నాయని, నేను లేనప్పుడు ఏ చిన్న అణువు కూడా ఏమీ చేయజాలదు అన్న యదార్థ విషయాలతో కలిపి చూడాలి. అప్పుడే అవి చక్కగా భాసిస్తాయి.

ఈసుందరోజ్జ్వల హేమంత ప్రభాతానికి నాఆత్మకూ రక్తసంబంధమైన బంధుత్వం ఉన్నది. ఈరంగు, పరిమళం, మధురసంగీతం, అన్నీకూడా మా రహస్య సంసర్గం యొక్క బాహ్య వ్యక్తీకరణమాత్రమే. యీ నిరంతర సంసర్గం ఫలించినా ఫలించక పోయినా, నామనస్సును కదిలిస్తూనే ఉంటుంది. నా అంతరజగత్తు, బాహ్యజగత్తుల సమ్మేళనం వలననే నేను అటువంటి మతాన్ని సంపాదించుకోగలిగేను. నా అది అధికమయినాసరే అల్పమయినాసరే ఇబ్బందిలేదు. కారణం అది నా స్వశక్త్యనుగుణ్యమైనది అవడమే. యీ

నా మతం దృష్ట్యా, పురాణాలను పరిశోధించి, తదుపరే నా వాటిని చేసుకోవడమో, మానడమో నిర్ణయిస్తాను.

పె. లీ దా,
12—12—1895

యీమధ్య ఒక సాయంత్రాన ఏదో ఇంగ్లీషు పుస్తకం తీసి చదవ ప్రారంభించాను కవిత్వం, కళలు, సౌందర్యం ఇత్యాది విషయాలమీద విమర్శలు, వివాదాలు, తర్కాలు ఎన్నో ఉన్నాయి. యీపుస్తకంలో అసహజంగా ఉన్న యీ ప్రసంగాలు చదువుకుంటూ వెళ్ళగా వెళ్ళగా, నాబుద్ధి శూన్యమైన ఎండమావులలోనికి వెళ్ళి తిరుగాడుతూన్నట్లు, అక్కడ ఏదో దెయ్యం వెక్కిరిస్తూన్నట్లు అనిపించింది.

ఇప్పుడు చాలా రాత్రి అయింది. ఆ చదువుతూన్న పుస్తకాన్ని దభేలున మూసేసి, రివ్వున టేబిలుమీదికి విసరివేసాను. ప్రక్కమీదకు వెళ్ళి నిద్దర పోదామనుకొని, దీపాన్ని ఊది ఆర్పివేసాను. ఆపని చేసీ చేయగానే తెరచి ఉన్న కిటికి గుండా వెన్నెలవాహిని ఒక్క ఉరుకునవచ్చి, గదంతా నింపేసింది. నేను ఆశ్చర్య చకితుడనయ్యేను.

అప్పుడు ఆరిపోయిన ఆ చిన్న గుడ్డిలాంతరు, చిల్లంగి (చేతబడి చేసే) పెట్టే వ్యక్తిలా నాకేసి చూస్తూ, శుష్కంగా అవహేళన చేయసాగింది. ప్రపంచ వ్యాప్తమైన అగాధ ప్రేమ నుండి ఉద్భవించిన ఈ అనంత ఆనందజ్యోతిని, ఆ కాస్త అవహేళనా తెరమరుగుకు నెట్టివేసింది. ఈ పుస్తకంలో గల

శుష్కపదాల్లో, ఏ ముందని ఇంతసేపూ చూసేను? నిజంగా నాకు కావాసిందల్లా అదుగో అదే! ఆకాశాన్నంతా నింపి, నాకోసం గంటల తరబడిగా మౌనంతో బయట కూర్చున్నది ఆ పండువెన్నెల!

కిటికీ తలుపులు మూసి ఉంచే పడుకునేందుకు వెళ్ళి పోయినట్లయితే ఈ సుందర దృశ్యాన్ని నష్టపోయి ఉందును. పాపం ఆ కాముదీసుందరి కూడా బయటే ఉండిపోయి, లోనుంచి లాంతరు అవహేళన చేస్తున్నా ఫిర్యాదయినా చేయక అలా వుండి పోయేది. నా జీవితమంతా ఆ చంద్రికను గుర్తించకుండా ఉన్నాసరే- ఈ గ్రుడ్డి లాంతరునే చివరవరకూ జయించ నిచ్చినాసరే- ఆఖరివరకూ అంధకారంతోనే శయ్యమీదకు వెళ్ళినా సరే- ఆ వెన్నెలరేడు మాత్రం యథాప్రకారంగా అక్కడే ఉంటాడు. మధురాతి మధురంగా నవ్వుతూంటాడు. నిశ్చలంగా, నిరాటంకంగా వెన్నెల చిలుకుతూ, యుగ యుగాల్లో మాదిరిగానే నాకోసం నిరీక్షిస్తూ ఉంటాడు.

సమాప్తం.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B180 |
| పుస్తకం పేరు | వాజమ్మ భూమి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 149 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 4, BCI |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | d. praveen |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |